3.2.1995 శుక్రవారం. 14 పేజీలు. సంపుటి : 67. సంచిక : 5. విడిప్రతి : రూ. 2.00 లు

Phone : 27554

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు    జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# ఆమెను చూస్తే ఆయనకెందుకంత భయం?

రాష్ట్ర రాజకీయాలలో, మరీ ముఖ్యంగా తెలుగుదేశం పార్టీలో శ్రీమతి లక్ష్మీపార్వతి పాత్ర, ప్రమేయం, స్థాయి, స్థానం ఏమిటో స్పష్టంగా, తేట తెల్లంగా, తొట్రుపాటు లేకుండా, పొరపాటు అభిప్రాయాలు ఏర్పడకుండా ప్రకటించేశారు ఎన్టీ రామారావు గారు; ఆమె రాజకీయ ప్రవేశాన్ని, జోక్యాన్ని ఆహ్వానించారు. తెలుగుదేశం జిల్లా కమిటీలన్నీ కలిసి తనకు జరిపిన సన్మాన సభను ఈ ప్రకటనకు ఎంచుకోవడంలో కూడా ఆయన దూరదృష్టి అర్థమౌతుంది. తన మాటగా ఈ వార్త ఒకేసారి అన్ని జిల్లాల కార్యకర్తలు, నాయకులకు చేరిపోతుందనే ఉద్దేశ్యంతోనే ఆయనా సభను ఎంచుకున్నారు.

దీనికి తరువాతి చర్యగా శ్రీమతి లక్ష్మీపార్వతి హైదరాబాదు సిటీలోని ఫిలిం నగర్‌లో గుడిసెల తొలగింపు సమస్య తలెత్తగానే, దాదాపు ముఖ్యమంత్రి హోదాలో అక్కడికి వెళ్లి పరామర్శించి వచ్చారు. అధికారులకు ఆదేశాలు జారీ చేశారు. గుడిసె వాసులకు వేరే ఇళ్లు కట్టిస్తానని వాగ్దానం చేశారు. అధికారులు, మరీ ముఖ్యంగా పోలీసు అధికారులు ఆమెలో ముఖ్యమంత్రినే చూశారనాలి. ఆమె తిరిగి వచ్చి ఏమి చెప్పిందో, లేదా ఏమి ఆదేశించిందో తెలియదు గాని ఎన్టీ రామారావు గారు క్షణాలలో సంబంధిత ఆర్డీఒను సస్పెండ్ చేశారు. అరెస్టు చేసిన ఎమ్మెల్యేలిద్దర్ని విడుదల చేయించారు. విచిత్ర మేమిటంటే పూర్తిగా రెవిన్యూ శాఖకు సంబంధించిన ఈ గొడవలో ఎవరూ రెవిన్యూ మంత్రి శ్రీ చంద్రబాబు నాయుడ్ని పట్టించుకోలేదు. కనీసం ఆర్డీఒ సస్పెన్షన్ సంగతి చెప్పలేదు. ఆ తర్వాత కలెక్టర్ జోక్యం చేసుకొని, ఆర్డీఒ తాను చెప్పిన మాట ప్రకారం చేశారు కాబట్టి ఆతన్ని సస్పెండ్ చేయరాదని, సస్పెండ్ చేస్తే తాను సెలవు పై వెళ్లిపోతానని బెదిరించడం, లక్ష్మీపార్వతి భయపడి మళ్లీ ఎన్టీఆర్ చేత అప్పటికప్పుడు ఆర్డీఒ సస్పెన్షన్ను విత్‌డ్రా చేయించడం జరిగినా, చంద్రబాబును సంప్రదించిన వారే లేరు.

> **లక్ష్మీపార్వతి అలిగినా, ఆగ్రహించినా అంత పెద్ద అన్నగారు తల్లడిల్లి పోతున్నారు!**

ఎన్టీ రామారావు గారు ఇంత నిస్సిగ్గుగా తన భార్యామణి ఆదేశాలు పాటిస్తూ, భార్యా విధేయుడుగా మెలగడానికి కారణమేమిటి? పబ్లిక్‌గా రాజకీయాలలో ఆమె జోక్యం తన కభ్యంతరం లేదని ప్రకటించ వలసిన ఆగత్యం ఏమిటి? అధికార యంత్రాంగం యావత్తునూ ఆమె గుప్పెట్లో బిగించడానికి ప్రోద్బలం ఏమిటి? అవి కేవలం ప్రేమ, ఆరాధనా భావాలేనా? లేక మరేదైనా బలీయమైన కారణం వుందా? వరుసగా జరుగుతున్న సంఘటనలను, పరిణామాలను చూస్తుంటే ఆమె పట్ల అభిమానంతో మాత్రమే ఇంతటి మానసిక దౌర్బల్యం ప్రదర్శిస్తున్నాడని భావించ లేకున్నాము. ఆమె అలిగినా, ఆగ్రహించినా, యముడి వంటి ఎన్టీ రామారావు మైనం వలె కరిగి పోయి భార్యా విధేయత ప్రకటించడం ఆశ్చర్యం కల్గిస్తున్నది. ప్రేమ కంటే, ఆరాధన కంటే, అభిమానం కంటే, అపేక్ష కంటే బలీయమైన కారణమేదో ఆయన్ను ప్రభావితం చేస్తుండాలి. అది భయమను కోవాలా? ఆమెను చూసి ఆయనంత భయపడడానికి కారణమేమిటి? ఆయనలోని ఏ బలహీనతను పసిగట్టి ఆమె భయపెడుతున్నది?

ఇది కేవలం ఇద్దరు భార్యా భర్తల మధ్య నలిగే సమస్య కాదు; అది వారింటి స్వంత విషయం అసలే కాదు. ఇది రాష్ట్ర ప్రజలందరికీ సంబంధించిన వ్యవహారం. ఎందరో ముఖ్యమంత్రులు ఈ రాష్ట్రాన్ని పరిపాలించారు. వారందరికీ భార్యలూ వుండినారు. కాని ఇప్పటి వరకు ఏ ముఖ్యమంత్రి భార్య సైతం ఇట్లా ప్రజల పై, ప్రభుత్వ యంత్రాంగం పై కర్ర పెత్తనం చలాయించలేదు. గతంలో తెలుగుదేశం ఏడేళ్ల

[illegible] 8 పేజీలో

# షేర్ల ధరల పతనం ఆగినట్లే!

దాదాపు నాలుగు నెలలు అవరోహణా క్రమంలో పయనించి వున్నాయి. తర్వాత చంద్రుడిపైకి రోజురోజుకి ఎక్కి పగపై పోతుండిన షేర్ మార్కెట్ తిరిగి పుంజుకొంటున్నది. బదలా ట్రేడింగ్ పున ప్రవేశ పెట్టనున్నారన్న పుకారుతో జనవరి 27 తేది నుంచి ప్రారంభమైన బొంబాయి స్టాక్ ఎక్స్ఛేంజి క్రమక్రమంగా పైకి ఎగబ్రాకు తున్నది.

గత సెప్టెంబరులో బిఎస్ఇ ఇండెక్స్ అత్యధిక స్థాయికి (4643.31) చేరిన తర్వాత, ఈ నాలుగునెలల్లో క్షీణత తప్ప, వృద్ధి అనేదే ఎరుగలేదు. వారం క్రితం జనవరి 24తేది అదే ఇండెక్స్ 3394 పాయింట్లకు పడిపోయింది. అంటే దాదాపు 1250 పాయింట్లు (28శాతం) క్షీణించి పోయిందన్నమాట.

కాని వున్నట్లుండి జనవరి 27తేది తొలిసారిగా మార్కెట్ పునరుజ్జీవనం ప్రారంభమైంది. ఆ ఒక్కరోజే ఇండెక్స్ 55 పాయింట్లు పెరిగింది. మధ్యలో ఒక రోజు పతనమైనా 31తేది ఇండెక్స్ 3618పాయింట్ల దగ్గర ముగిసింది. అంటే మూడు నాలుగు రోజుల వ్యవధిలోనే దాదాపు 225 పాయింట్ల వరకు కోలుకున్నదన్న మాట. తిరిగి 1తేది ఇది 48 పాయింట్లు తగ్గింది.

పునరుద్ధరణకు కారణాలు చాలానే వున్నాయి. బదలా ట్రేడింగ్ పుకారు మొదటిది. అర్జున్‌సింగ్ వివాదం వల్ల కేంద్రంలో ప్రభుత్వానికి ఎటువంటి ప్రమాదం లేదని రుజువుకావడం మార్కెట్‌లో ఆత్మవిశ్వాసం పెంచింది. ఇది చూసి సంస్థాగత పెట్టుబడిదారులు మెల్ల మెల్లగా రంగప్రవేశం చేశారు. దానితో వున్నత స్థాయిలో అమ్మకాల ఒత్తిడి తగ్గి, కొనుగోలు ఆసక్తి పెరగడంతో మార్కెట్‌కు జవసత్వాలు సమకూరుతున్నాయి. రిలయన్స్, టెల్కో, గ్రాసిం, హిందాల్కో, ఇండియన్ రేయాన్ వంటి షేర్లపైన విదేశీ పెట్టుబడిదారులు ఆసక్తి ప్రదర్శించారు. మెక్సికో వలె భారత దేశంలో మారక ద్రవ్య సంక్షోభం తలెత్తే ప్రమాదం లేదని; అంతర్గత రాజకీయ కలతల వల్ల ఆర్థిక సంస్కరణలు దెబ్బతినే అవకాశం లేదని మోర్గాన్ స్టాన్లీ వంటి సంస్థలు ప్రకటించడం కూడా విదేశీ సంస్థల్లో భయ సందేహాలను నివృత్తి చేశాయి.

మార్కెట్‌లో సాంకేతిక సర్దుబాటు మరి కొంతకాలం కొనసాగి, త్వరలోనే షేర్ల ధరలు స్థిరీకరింప బడతాయని పరిశీలకుల అంచనా.

వ్యాపార లోకం

## జపాన్‌బ్యాంకు నష్టం 8వేల కోట్లు

జపాన్ దేశంలోకెల్లా అతి పెద్ద బ్యాంక్ అయిన సుమిటోమో బ్యాంక్ తనకు ఈ ఏడాది అంతానికి 2.8 బిలియన్ డాలర్ల (దాదాపు 8వేల కోట్ల రూపాయలు) నష్టం వస్తుందని అంచనా వేసింది. 1946 సంవత్సరం తర్వాత ఈ బ్యాంకు నష్టాలు చవిచూడడం ఇదే ప్రథమమట. కొండంత పరిమాణంలో -12 బిలియన్ డాలర్ల స్థాయికి పెరిగిపోయిన దాని బాకీల నుంచి 8 బిలియన్ డాలర మేరకు (24 వేల కోట్ల రూపాయలు) రద్దు చేసేయాలని నిర్ణయించడమే దీనికి కారణం. అంటే జపాన్‌లో కూడా మనవలె బ్యాంకులకు టోపీ పెట్టేవారు దండిగా వున్నారన్నమాట. ఈ బ్యాంకు రద్దు చేసిన బాకీల మొత్తం, మన బ్యాంకులన్నీ కలసి ఇచ్చే అప్పుల కంటే ఎక్కువగా వుంది!

### ముందున్నది ముసళ్లపండగ

రానున్న కాలంలో నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరగబోతున్నాయని సాక్షాత్తు కేంద్ర ప్లానింగ్ కమీషన్ సభ్యుడు జి.వి. రామకృష్ణ చెప్పారు. ఇందుకాయన ఉదహరించే కారణం- ఆర్థిక సంస్కరణలు! కరెంట్ ఛార్జీలు కూడా అలివికానంత పెరిగిపోతాయని భయపెడుతున్నారాయన.

ప్లానింగ్ కమీషన్ సభ్యుడంటే- ఆర్థిక సంస్కరణల అమలులో ప్రత్యక్ష ప్రమేయం కల్గినవాడు. ఆయనే ధరలు పెరగబోతున్నాయని చెప్పాడంటే- ప్రజల ముందున్న ముసళ్లపండగ ఎంత బాధాకరమైనదో వూహించు కోవచ్చు.

| వరివిత్తనములు | | |
|---|---|---|
| NLR | 30491 | (120 రో) |
| NLR | 33633 | (120 రో) |

పై విత్తనములు, మొక్కదుగు, ఎడగారుకు పనికి వచ్చే మంచి విత్తనము కావలసిన వారు

పి.డి. రామిరెడ్డి

కనుపర్తిపాడు

31 నంబరు బస్ సౌకర్యము కలదు.

# మార్కెట్‌ను ముంచెత్తుతున్న పబ్లిక్ ఇష్యూలు!

షేర్ మార్కెట్ ఎత్తు పల్లాలలో పయనిస్తున్నప్పటికీ కొత్తగా కంపెనీలు విడుదల చేసే పబ్లిక్ ఇష్యూలు మాత్రం వెల్లువగా వస్తున్నాయి. వాటికి జనం ఆదరణ సైతం అట్నే వుంది. రెండేళ్ల నుంచి కొత్తగా పరిశ్రమలు స్థాపించాలని తలపెట్టే వారందరూ బ్యాంకు లోన్ల పై కాకుండా, పబ్లిక్ ఇష్యూల పైనే అధికంగా ఆధార పడుతున్నారు. కొందరు పారిశ్రామిక వేత్తలు కేవలం పబ్లిక్ ఇష్యూల కోసమే కొత్త ప్రాజెక్టులు రూపకల్పన చేస్తున్నారన్నా ఆశ్చర్య పడాల్సింది లేదు. ప్రైవేటు పెట్టుబడి దారులకు పోటీగా బ్యాంకులు, ఐడిబిఐ వంటి ప్రభుత్వ రంగ సంస్థలు, ఓఎన్‌జిసి వంటి పబ్లిక్ సెక్టార్ యూనిట్లు కూడా ప్రజల నుంచి ధన సేకరణకు అత్యుత్సాహం చూపించడం విశేషం. వచ్చే మార్చి లోపల రెండు నెలల్లో కనీసం 47 వేల కోట్ల రూపాయలకు వివిధ కంపెనీలు పబ్లిక్ షేర్లు జారీ చేయనున్నాయని అంచనా. భారత్ వంటి వర్ధమాన దేశంలో, ఇంతేసి భారీ మొత్తాలు పరిశ్రమల రంగానికి పెట్టుబడిగా తరలి రావడం ఆర్థిక శాస్త్రవేత్తలను సైతం ఆశ్చర్యంలో ముంచెత్తు తున్నది. ప్రజలు తాము పొదుపు చేసిన సొమ్మును బంగారు వంటి వస్తువుల పై వెచ్చించకుండా, అధిక రాబడి గల్గిన షేర్ల మార్కెట్‌కు తరలించడమే దీనికి కారణం. ఇది

కడప 8 పేజీలో

# ప్రైమరీ షేర్‌మార్కెట్ కంటే సెకండరీలో కొనడమే మేలు!

సెకండరీ మార్కెట్‌లో షేర్ల ధరలు గత నాలుగు నెలలుగా పతనం కావడం చూస్తున్న సాధారణ ఇన్వెస్టరు తన పెట్టుబడులను ప్రైమరీ మార్కెట్‌కు తరలిస్తున్నారు. వారానికి 20, 30 కంపెనీలకు పైగా విడుదల చేస్తున్న పబ్లిక్ ఇష్యూలలో విపరీతంగా పెట్టుబడి పెడుతున్నారు. ప్రైమరీ మార్కెట్‌లో తమ పెట్టుబడికి భద్రతతో పాటు, త్వరితంగా లాభాలు వస్తాయన్న ఆశ ఇందుకు కారణం. అయితే ఈ భావన అంత శ్రేయస్కరం కాదు. ప్రైమరీ మార్కెట్‌లో షేర్లు లభిస్తాయన్న గ్యారంటీ లేదు. పలు ఇష్యూలు 20, 30 రెట్లు ఓవర్ సబ్‌స్క్రయిబ్ అవుతున్నాయి. అందువల్ల ఈ కంపెనీలు లాటరీ పద్ధతిలో షేర్లు అలాట్ చేస్తున్నాయి. దానితో షేర్ల కేటాయింపు అదృష్టం పై ఆధార పడవలసిన విషయంగా మారింది. షేర్లు అలాట్ కాని సందర్భంలో పెట్టుబడి మొత్తాలు వృధాగా కంపెనీల ఖాతాలలో పడి వుంటాయి. మూడు నాలుగు నెలలు వాటి పై వడ్డీ కూడా రాదు.

అందువల్ల కొంచెం మెళకువగా వ్యవహరించి, కంపెనీల స్థితిగతులను అధ్యయనం చేసి, జాగ్రత్తగా పెట్టుబడి పెడితే ప్రైమరీ మార్కెట్ కంటే, సెకండరీ మార్కెటే శ్రేయస్కరం. ఇప్పుడున్న షేర్ మార్కెట్ పరిస్థితిలో మంచి లాభాలార్జిస్తూ, డివిడెండ్లు, బోనస్‌లు ఇచ్చే కంపెనీల షేర్లు చాలా తక్కువ ధరలకు లభిస్తున్నాయి. పబ్లిక్ ఇష్యూలకు వున్నదంతా పూర్తి అప్లికేషన్లు పెట్టి, షేర్లు రాక నిరుత్సాహ పడేకంటే సెకండరీ మార్కెట్‌లో చవకగా లభిస్తున్న షేర్లను కొనుక్కోవడం ఉత్తమం. అయితే అట్టని వూరు, పేరు తెలియని కొత్త కంపెనీల జోలికి పోవడం ప్రమాదకరం.

సెకండరీ మార్కెట్‌లో పెట్టుబడి పెట్టే వారు తమ పెట్టుబడిలో కనీసం సంవత్సరం పాటు పెరుగుదల వుండదని భావించి షేర్లు కొనాలి. కనీసం 25 శాతం పెట్టుబడి వృద్ధి వుంటుందని అంచనా వేసి; ధరలు పడిపోయినా 10 నుంచి 12 శాతంకు మించి నష్టం రాదని నమ్మకం కల్గిన షేర్లనే కొనుగోలు చేయడం అవసరం. సరైన అధ్యయనం, సమాచారం లేకుండా స్పెక్యులేషన్‌లో

కడప 8 పేజీలో

నాలు

28.1.95 తేదిన అకస్మికంగా మరణించిన

## శ్రీ నల్లవడ్ల శంకరరెడ్డి గారు

(లేట్ నల్లవడ్ల రాఘవరెడ్డి కుమారుడు, పోకూరుపల్లి, రాపూరు మండలం)

అకాల మరణానికి చింతిస్తూ దుఃఖసాగరంలో మునిగివున్న వారి కుటుంబానికి మనోధైర్యం ప్రసాదించాలని కోరుకుంటూ వారి ఆత్మకు చిరశాంతిని కలుగచేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

పెద్దమ్మ: నల్లవడ్ల వెంకటసుబ్బమ్మ

అన్న: నల్లవడ్ల వెంకట రమణారెడ్డి
D.D. Marketing, Guntur

వదిన: నల్లవడ్ల వెంకమ్మ

అన్న కుమారుడు: నల్లవడ్ల దయాకరరెడ్డి

అన్న కుమార్తె: నల్లవడ్ల విజయశ్రీ

అన్న అల్లుళ్లు - కుమార్తెలు

జి.వి. సుబ్బారెడ్డి - అరుణ కుమారి

జి. ప్రసన్నాంజనేయ రెడ్డి - శైలజ

మనుమడు: రాకేష్ (బాబి)

మనుమరాలు: హని

# గంగతీర్థంపారేనా?

సరిగ్గా ఈ సంవత్సరం అంతానికి తెలుగుగంగ తీర్థంతో చెన్నపట్నం తమిళుల గొంతు తడార్చుతామని ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీ రామారావు, తమిళ ముఖ్యమంత్రి జయలలిత సమక్షంలో ప్రకటించారు. ప్రాజెక్టు పూర్తి దశకు చేరనప్పటికీ, తొలి విడతగా 3 టిఎంసిల నీరు అందించేందుకు ఇద్దరి మధ్య అవగాహన కుదిరింది. ఆ తర్వాత మూడేళ్లలో ఏటా 3 టిఎంసిల అదనపు నీరు లెక్కన సరఫరా చేస్తామని, 1998 నాటికి ఈ పథకం తుది దశ ముగుస్తుందని ఎన్టీఆర్ ఆమెకు నమ్మ బలికారు.

ఇప్పటికి ఎన్నిసార్లు తెలుగు, తమిళ ముఖ్యమంత్రుల మధ్య ఇటువంటి ఒప్పందాలు, అంగీకారాలు, అవగాహనలు జరిగాయో లెక్కే లేదు. ప్రాజెక్టును ప్రారంభించి పుష్కర కాలం దాటింది. శంకుస్థాపన సమయంలోనే, ఐదేళ్ల లోపల మద్రాసుకు నీరు అందిస్తామని ప్రగల్భాలు పలికారు. ఆనాడు ప్రాజెక్టు అంచనా వ్యయం కేవలం 637 కోట్ల రూపాయలు. అదేమి దుర్ముహూర్తమో తెలియదు కాని, కాలువ త్రవ్వకానికి తొలి పార మట్టి తీసినప్పటి నుంచీ అన్నీ అవరోధాలే, అన్నీ అవాంతరాలే. పర్యావరణం పెద్ద సమస్య అయింది. బచావత్ ట్రిబ్యునల్ అవార్డు ప్రకారం, వున్న ప్రాజెక్టుల నుంచి వాడుకొనే నీటి పరిమాణం ఆధారంగా రెండువేల సంవత్సరాల నాటికి మూడు రాష్ట్రాల మధ్య కృష్ణ మిగులు జలాల పంపకం జరగాలే తప్ప, అందుకోసం కొత్తగా ఏ ప్రాజెక్టు కట్టకూడదు. మద్రాసుకు 15 టిఎంసిల మంచినీరు ఇవ్వడం వరకు కర్ణాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు సమ్మతించాయి; కాని అదే కాలువ ఆధారంగా నెల్లూరు, రాయలసీమలలోని దాదాపు 3 లక్షల ఎకరాల పైన బీడు భూములను మాగాణులుగా మార్చేందుకు ఆంధ్ర ప్రభుత్వం చేస్తున్న ఏర్పాట్లను ఆ రాష్ట్రాలు వ్యతిరేకించాయి. ఫలితం - కేంద్ర జల సంఘం అనుమతి నిరాకరణ. దానివల్ల కేంద్రం నుంచి నిధులు రాలేదు. ప్రపంచ బ్యాంకు వంటి సంస్థల నుంచి అప్పు పుట్టలేదు. రాష్ట్ర ప్రభుత్వం దగ్గర అన్ని నిధులు సమకూర లేదు. ఫలితం - అడుగడుగున గండాలు, అనుదినం కడగండ్లతో తెలుగుగంగ కాగితాలపై నుంచి కాలువ లోకి దూకి ప్రవహించే మహత్తర దినం వాయిదా పడుతూనే వస్తున్నది.

ఈ అనివార్య కారణాల వల్ల ప్రాజెక్టు అంచనా - పెరిగి, పెరిగి, కొండంత ఎత్తుకు ఎదిగి, 2129 కోట్లకు చేరుకున్నది. 637 కోట్లతో మొత్తం పూర్తవుతుందను కున్నది కాస్త, 750 కోట్లు ఖర్చు పెట్టిన తర్వాత అంతకు రెండింతలు డబ్బు అవసర పడుతున్నది.

ఈ పరిస్థితులలో డిసెంబరు నాటికి దాహంతో తడార్చుక పోయిన మద్రాసు ప్రజల గొంతులపై తెలుగు తీర్థం చిలక రిస్తామని హామీ ఇవ్వడం సాహసంతో కూడిన వాగ్దానమే ననాలి. ఈలోగా పని పూర్తి కావాలంటే 270 కోట్లు ఖర్చు చేయాలి. తమిళనాడు తన వాటా క్రింద ఇప్పటికే 72 కోట్లు ఎక్కువగా ఇచ్చి వుంది కాబట్టి, పని జరిగితే తప్ప నిధులివ్వ లేమని జయలలిత స్పష్టం చేశారు. తాము తెలుగుగంగ కోసం ఇచ్చే నిధులను రామారావు ప్రభుత్వం సబ్సిడీ బియ్యం పథకం కోసం తరలిస్తారన్న భయాన్ని ఆమె పరోక్షంగా వ్యక్తం చేశారు. అందువల్ల వారి సంతృప్తి మేరకు పనులు జరిపిస్తే తప్ప వారినుంచి నిధులు రావు.

మద్య నిషేధం, సబ్సిడీ బియ్యం పథకాలతో ఖజానా వూడ్చుకొని పోయి, అప్పుల భారం తలకెత్తుకున్న రాష్ట్ర ప్రభుత్వానికి ఇది అలివయ్యే పనేనా? జీత భత్యాలకే కనాకష్టంగా వున్న పరిస్థితులలో ఈ ఏడాది లోపల 270 కోట్లు తెలుగుగంగ పనులకు ఖర్చు పెట్టడం ప్రభుత్వానికి సాధ్యమా? సందేహమే. తతిమ్మా మూడేళ్లలో ప్రాజెక్టును పూర్తి చేయాలంటే ఏటా కనీసం 460 కోట్లు కేటాయించాలి. సబ్సిడీ బియ్యానికి పోను ఇంత నిధులు మిగల్చ గల్గే ఆర్థిక మంత్రిని వెతికి పట్టడం కంటె తివిరి ఇసుమున తైలము తీయడం సులభం.

మద్రాసు మంచి నీళ్లకే కాక, రాయలసీమ రాతి నేలల్లో పైరు పచ్చదనాలు వికసింప చేయడానికైనా తెలుగుగంగను సత్వరం పూర్తి చేయడం అవసరం. నిధుల [illegible]మితో మీనమేషాలు లెక్కబెడితే 2000 సంవత్సరం దాటిన తర్వాత ఇన్ని వేల కోట్ల పెట్టుబడి వృధా అయిపోతుంది. ఎగువనున్న రాష్ట్రాల వారు ఈ కాలువ లోకి చుక్కనీరు పారనివ్వరు. రాష్ట్ర ప్రభుత్వం ఈ ప్రమాదాన్ని గుర్తించి ఏదో ఒక రూపేణా నిధులు సమకూర్చుకొని ప్రాజెక్ట్ సకాలంలో పూర్తి చేయడానికి అధిక ప్రాధాన్యత నివ్వాలి. *

## జమీన్‌రైతు

2-2-1945
పేజీలు. 10, వెల. 0-1-6

## 50 ఏళ్లక్రితం ఈవారం

### ఇండ్లకంట్రోలు

ఇండ్ల అద్దెలు పట్నమాపాలలో పెరిగిపోతున్నవి. అసలు ఇండ్లు వెతకడమే పెద్ద పనైపోయింది.

చెన్నపట్నంలో అందుకని కంట్రోలు పెట్టారు. 15 రూపాయలకు మించిన బాడుగగల ఇండ్లు ఖాళీయైన వెంటనే కంట్రోలరుకు, ఇంటి యజమాని తెలియజేయవలెను. ఇండ్లు అద్దెకు కావలసినవారు కంట్రోలరుకు అర్జీ పెట్టుకొనవలెను.

గుంటూరు, నెల్లూరు ఇత్యాది పట్నవాసాలు చెన్నపురిని తలదంతున్నవి. వీటికి కంట్రోల్ వుంటె తప్ప లాభంలేదు.

### నెల్లూరు ముచ్చట్లు

#### గిల్టునగలమోసం

నెల్లూరు పౌరోహితుడు భద్రాద్రిశాస్త్రులను బంగారు నగలు యిప్పిస్తానని తీసుకపోయి డబ్బుతట్టుకొని, గిల్టునగలు యిప్పించి మోసం జేశాడన్న నేరం సందర్భంలో స్టోన్‌హౌసుపేట పలివేరు పూర్ణానందం గారిని, చెన్నూరుటీచరు పేట కాలేపాను 31 రాత్రి టౌన్ సబ్‌యిన్‌స్పెక్టరు అరెస్టు చేశారు. ఈ పూర్ణానందం, మాచర్ల నర్సమ్మకు రిక్షాలు ఇప్పిస్తానని రు.400/-లు తట్టుకొని మోసంజేశాడని మరొక కేసుగూడా రికార్డు అయిందట. ఇంకా రిక్షాలిప్పిస్తానని యశోదమ్మవద్ద రు.100/-లు, నవాబుపేట వైశ్యస్త్రీ వెంకట సుబ్బమ్మవద్ద రు.200/-లు తట్టుకొనడని గూడా వార్తలు పొక్కుతున్నవి. టవున్ సబ్‌యిన్‌స్పెక్టరు యింకా తొవ్వు తున్నారు.

#### శిక్షతగ్గింపు

తలపిన్ను 0-0-1 జాస్తికి అమ్మిన గండ్లపల్లి రామానుజం అప్పీలులో ఒక నెల శిక్షను 8 రోజులకు తగ్గించి, రు100 /- జుల్మానా ఖాయం చేశారు.

#### ఖరాకుంచం

నెల్లూరులో వాడుకలో వుండే శేర్ల పరిమాణప్రకారం 14 శేర్ల ఖరాముద్ర కుంచములనే వాడవలయునుగాని, యితర కుంచములతో కొలిచిన చట్టప్రకారం శిక్షింపబడుదురని కలెక్టరుగారు ప్రకటిస్తున్నారు.

* * *

చూ: 10 పేజీ

## జనవాణి

### రాజీనామాలతో మంత్రుల పాపాలు పరిహారమౌతాయా?

షేర్ మార్కెట్, చక్కెర కుంభకోణాల్లో బాధ్యులైన ముగ్గురు మంత్రులను కేంద్ర క్యాబినెట్ నుంచి తొలగించమని ప్రతిపక్షాలు, ప్రజలు గోలచేయగా గత్యంతరంలేని పరిస్థితులలో వారిచేత ప్రధాని రాజీనామా చేయించారు. మంత్రులు రాజీనామా చేయడం వల్ల ఎవరికి ప్రయోజనం చేకూరింది? ఆరోపణల్లో చిక్కుకున్న కోట్లాది రూపాయల డబ్బు మాటేమిటో ఎవ్వరూ చెప్పరు. వెంటనే ఒక కమిషన్ నియమించి విచారణ చేయమంటారు. అది లక్షలాది రూపాయల ఖర్చుపెట్టి ఏదో తప్పుడు తడికెల నివేదిక తయారు చేస్తుంది. నివేదికలోని అంశాలపై చర్యలు అంతంత మాత్రమే. ఈ తంతు వ్యవస్థలో వేళ్లూనుకొని పోతున్నది. ఆవిధంగా ఆరోపణలకు గురైన అధికారులు, రాజకీయ నాయకులను ప్రజల సమక్షంలో విచారించాలి. ఆరోపణలు నిజమైనప్పుడు వారి స్థిర చర ఆస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకొంటె గాని అవినీతికి అడ్డుకట్ట పడదు.

ఇస్కపాలెం -దేవళ్ల రాధాకృష్ణారెడ్డి.

### సన్మానాలు కాంగ్రెస్‌వారితో సరాగాలు దేశంతో...

వేమారెడ్డి రామచంద్రారెడ్డి తెలుగుదేశంలో చేరినందుకు వెల్లడించిన కారణాలు చదువుతుంటె నవ్వొచ్చింది. నాయకుల చేతిలో ఓట్లు లేవన్న సంగతిని మొన్నటి ఎన్నికల్లో ప్రజలు స్పష్టపరిచారు. కాంగ్రెస్‌పై ఏహ్య భావంతో చేరానని చెబుతున్న రామచంద్రారెడ్డి కాంగ్రెస్ పార్టీ ద్వారా వచ్చిన డి.సి.బి. ఛైర్మన్ పదవికి చివరి వరకు ఎందుకు రాజీనామా చేయలేదు? ప్రభుత్వం మారినందువల్ల ఏ అధికారీ గూడూరు డివిజన్‌లో తనను లెక్క చేయడు కాబట్టి ఆయన పార్టీ మార్చారని సామాన్యులకు సైతం అర్థమవు తున్నది. కాంగ్రెస్ మీద ఏహ్యాభావంమే వుండి వుంటె మొన్న బ్రహ్మదేవంలో కాంగ్రెస్ వాదులైన పి.వి. ప్రసన్నరెడ్డి, కె.కె.రెడ్డి, మెట్టు చంద్రశేఖరరెడ్డి, గంగాధరం చేతులమీదుగా ఎందుకు సన్మానాలు చేయించుకొన్నారు? ఈ సభకు స్థాయిగల దేశం కార్యకర్త ఒక్కరూ హాజరు కాలేదంటె తమ పార్టీలో వేమారెడ్డి ప్రవేశం పట్ల దేశం కార్యకర్తల అభిప్రాయం వెల్లడయ్యింది. మాసిన చొక్కా తీసేసి వుతికిన చొక్కా వేసుకొన్న మాదిరి పార్టీలు మారొచ్చు; కాని నిజమైన తెలుగుదేశం కార్యకర్తలు ఎప్పటికీ ఆయనను నమ్మరు.

గూడూరు-తెలుగుదేశం కార్యకర్తలు.

చూ: 14 పేజీ

సాహిత్యంలో సత్యభామ గ్రంథావిష్కరణ చేస్తున్న గూడూరు డి.ఆర్.డబ్ల్యూ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ మోహన్‌మణి. వేదిక పై వర్ధమాన సమాజం కార్యదర్శి బి.వి. నరసింహం, రచయిత పి. వెంకటేశ్వర్లు, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి వున్నారు.

## అల్లరి లేకుండా ఆర్యవైశ్య ఎన్నికలు

కుల సంఘాల ఎన్నికలు మునిసిపల్ ఎన్నికలంత సరభసంగా జరగడం అనవాయితీ అయిపోయింది. వైశ్యుల విషయంలో ఈ హడావుడి మరీ ఎక్కువ 29 తేది జరిగిన ఆర్యవైశ్య సంఘ ఎన్నికల్లో పోయిన సారంత గలభా లేకపోయినా ఒకానొక దశలో కాసింత వుద్రిక్తత చోటు చేసుకుంది. మొత్తానికి పెద్దల జోక్యంతో గొడవ సద్దు మణిగి చివరికి జిల్లా ఆర్యవైశ్య సంఘ అధ్యక్షునిగా కనమర్లపూడి తిరుమల రావును ఎన్నుకోవడం జరిగింది. ఎన్నికకు ముందు సోమిశెట్టి కాశయ్య, చిదెళ్ల వెంకటేశ్వర్లు, గాదంశెట్టి గోపాల్, మొగలి లీలామోహన్ మరికొందరు ప్రముఖులు కలసి చర్చల ద్వారా అధ్యక్షుడ్ని ఏకగ్రీవంగా ఎన్నుకోవాలని నిర్ణయించు కొన్నారు. అనూహ్యంగా తిరువీధి రమణయ్య రంగ ప్రవేశంతో 8 నామినేషన్లు వచ్చాయి. ఎట్టకేలకు ఆయనవిరమించు కోవడంతో తిరుమల రావు ఎన్నికైనట్లు పర్యవేక్షకులుగా వచ్చిన మాజీ ఎమ్మెల్యే గ్రంధి మాధవి. కర్నాటి సుబ్బారాయుడు ప్రకటించారు. తిరుమల రావు ప్రస్తుతం సింహపురి వాణిజ్య మండలి, జిల్లా డాల్ మిల్లర్స్ అసోసియేషన్, కాంగ్రెస్ బ్లాక్ అధ్యక్షునిగా పని చేస్తున్నారు. గత సంవత్సరం ఎన్నికలో పోటీ చేసి పరాజయం పాలై, ఈసారి పట్టుదలతో అధ్యక్షుడయ్యారు. జిల్లా వ్యాప్తంగా తరలి వచ్చిన వైశ్య ప్రముఖులతో ప్రత్రివారి సత్రం కిటకిట లాడింది

### శ్రీకృష్ణ దేవరాయ జయంతి సభ

వర్ధమాన సమాజం యాజమాన్యాన టౌన్‌హాల్‌లో ఈనెల 10 తేది శ్రీకృష్ణ దేవరాయ జయంతి సభ జరుగుతుంది. కళాప్రపూర్ణ మరుపూరు కోదండ రామిరెడ్డి అధ్యక్షతన జరిగే సభలో కవి ఉత్పల సత్యనారాయణా చార్య 'శ్రీకృష్ణ దేవరాయలు - సామాజిక స్పృహ' అనే అంశంపై ఉపన్యసిస్తారు. అనంతరం సభా పోషకులు చల్లగుండ్ల రామచంద్రయ్య తన జననీ జనకుల స్మృత్యంకంగా ఒసగే సన్మానాన్ని స్వీకరిస్తారు. సాహితీ ప్రియులను తరలి రమ్మంటున్నారు సమాజం కార్యదర్శి బి.వి.నరసింహం.






వేదం వెంకట్రాయ శాస్త్రి స్మారకార్థంగా టౌన్‌హాల్‌లో 29, 30, 31 తేదీల్లో నిర్వహించిన అఖిలాంధ్ర నాటకోత్సవాలకు అనూహిత ప్రేక్షక స్పందన లభించింది. నాటకాలు వేసిన మూడు రోజులూ టౌన్‌హాల్ క్రిక్కిరిసి పోయింది. 30 తేది హైదరాబాదు అర్పణ ఆర్ట్స్ థియేటర్ వారు కోఆపరేటివ్ బ్యాంక్ ఆవరణలో ప్రదర్శించిన 'ముల్లుబోయి కత్తి వచ్చి ఢాంఢాం,'' పెద్ద బాలశిక్ష గోగ్రహణం వీధి నాటకాలు పలువుర్ని ఆలోచింప జేశాయి. నాటకోత్సవాల సందర్భంగా జిల్లాకు చెందిన ప్రసిద్ధ రంగస్థల నటులు పొన్నాల రామసుబ్బారెడ్డి, రేబాల రమణ, గూడూరు సావిత్రి, బుర్రకథ కథకులు షేక్ నాజర్, పృధ్వి వెంకటేశ్వర్లు, కె.ఎస్.టి. సాయిని సన్మానించడం సముచితంగా వుంది. ఒక మంచి కార్యక్రమాన్ని నెల్లూరులో నిర్వహించిన రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక శాఖ, తెలుగు విశ్వవిద్యాలయం, జిల్లా సాంస్కృతిక మండలిని అభినందించి తీరాలి.

నాటకోత్సవాన్ని తొలి రోజుజ్యోతి వెలిగించి ప్రముఖ రంగస్థల నటులు, శంకరాభరణం ఫేం జె.వి. సోమయాజులు ప్రారంభించారు.

### నెల్లూరు సంగతులు

మానవ జాతి మనుగడ వున్నంత వరకు కళారంగానికి ప్రాముఖ్యత వుంటుంది. సమాజంలో నాగరికతకు కళలు మూలమంటూ నాటక రంగ పూర్వ ఔన్నత్యాన్ని కాపాడు కొనేందుకు పునర్వివింప జేసేందుకు ప్రజల్లో నడుం కట్టాలన్నారాయన. సినిమాలు, టి.వి. వీడియోల వల్ల నాటకాలకు నూరేళ్లు నిండలేదు. ప్రేక్షకుల్లో కళాభిమానం వున్నంత వరకు నాటకాలకు ప్రోత్సాహం వుంటుందని వివరించారు. నాటకాలకు సరియైన వసతులు లేనందువల్ల సినిమాలతో సమానంగా నాటకాన్ని రంజింప చేయలేని స్థితిలో వున్నట్లు చెప్పారాయన. అతిథిగా విచ్చేసిన కళాప్రపూర్ణ మరుపూరు కోదండ రామిరెడ్డి మాట్లాడుతూ నాటక రంగానికి సింహపురి పేరెన్నిక గన్నదని, ఏనాడో నెల్లూరులో నాటక సమాజాలు వెల్లి విరిశాయన్నారు. వేదం వెంకట్రాయ శాస్త్రిగారునాటక రంగానికి ఖ్యాతి తెచ్చిన మహోన్నత వ్యక్తని ప్రశంసిస్తూ, ఆ వెంకట్రాయ శాస్త్రి రచించిన బొబ్బిలి షలి, ప్రతాప

కరం 10 పేజీలో

## పెసర, మినుముల సాగుతో రైతుకు ధన లాభం, భూమికి సారం!

### డాక్టర్ పి. రాఘవరెడ్డి
రైస్ బ్రీడర్
నెల్లూరువరిపరిశోధనాస్థానం

మన ఆహారంలో వరి ప్రధానమైనప్పటికీ మనకు కావలసిన మాంసకృతుల (ప్రొటీన్సు) సరఫరాకు పప్పు ధాన్యాలే ప్రముఖ స్థానం వహిస్తాయి. లెగ్యూమ్ జాతికి చెందిన ఈ అపరాలు గాలిలోని నత్రజనిని గ్రహించి దానిని భూమికి చేరుస్తూ, భూసారాన్ని పెంపొందించుటకు దోహదం చేస్తున్నాయి. వరుసగా వరి పంటల సాగు కన్నా రెండు వరి పంటల మధ్య అపరాల సాగుద్వారా వరిలో చీడపీడల ఉధృతిని నివారించేందుకు వీలవుతుంది. సగటున మనిషికి రోజుకు 104 గ్రాముల పప్పు ధాన్యాలు అవసరం కాగా, ప్రస్తుతం మనం 40 గ్రాములను మాత్రమే పండిస్తున్నాము. అటు భూసారాన్ని పెంపొందించేందుకు, లాభసాటి పంటల సాగుకు, ప్రజావసరాలను తీర్చేందుకు అపరాల సాగు విస్తీర్ణాన్ని అధికోత్పత్తిని పెంచవలసిన అవసరం చాలావుంది.

మన నెల్లూరు జిల్లాలో అపరాలు ముఖ్యంగా పెసర, మినుము సాగు క్రమేపీ పెరుగుతూంది. వీటి సాగులో అధికోత్పత్తి రకాలను తగిన యాజమాన్య పద్ధతులను పాటించి, వీటి ద్వారా అధికోత్పత్తిని సాధించవలసిన ఆవశ్యకతను మన రైతాంగం గుర్తించాలి.

ప్రస్తుతం జనవరి-ఫిబ్రవరి మాసాల్లో ఈ అపరాల సాగును (పెసర, మినుము) ఇటు మాగాణి పొలాల్లో వరి తర్వాత వరికోతలకు ముందుగా వెదజల్లే పద్ధతి ద్వారా గాని, లేదా పొలం దున్ని ఆరుతడి పంటగాగాని పండించడం అనువుగా వుంటుంది. ఈ మధ్యనే కురిసిన వర్షాల వల్ల వేరుశెనగ దెబ్బతిన్న ప్రాంతాల్లో ప్రత్యామ్నాయ పంటలుగా పెసర, లేదా మినుము లేదా ప్రొద్దు తిరుగుడులను ఆయా పరిస్థితులను బట్టి సాగు చేయవచ్చు. ప్రస్తుతం మన జిల్లాలో సాగుకు అనువైన పెసర, మినుము రకాలు వాటి సాగుకు తగిన సూచనలను వివరిస్తున్నాను.

మన ప్రాంతానికి అనువైన మేలైన రకాలు:

కరవ 10 పేజీలో

## జిల్లా వార్తలు

# గూడూరు త్రాగుబోతులకు ఎక్సైజ్ అధికార్లే రక్ష!

నిన్న, మొన్నటి వరకు ప్రభుత్వ శాఖల్లో ఎక్సైజ్ శాఖ లంచ గొండులకు బంగారు బాతు. ఇప్పుడది బంగారు గనిగా మారిపోయింది. త్రవ్వే కొద్దీ లంచాలు పసిడి ముద్దలు వస్తూనే వున్నాయి అధికారులకు! శాసనాధికారాలిచ్చిన చట్టాన్ని అడ్డం పెట్టుకొని, డబ్బున్న మందు బాబులకు సలాములు చేస్తూ సామాన్యులను వేధించడం గూడూరు ఎక్సైజ్ అధికారులకు దినచర్యగా మారింది. మద్య నిషేధం విధించి రెండు వారాలు గడచినా గూడూరులో మందు బాబులకు ఏ లోటూ లేకుండా సరుకు దొరుకుతూంది. అమాయకులెవరైనా ఫలానా చోట మధుపానం జరుగుతుందని ఫోన్ చేసి ఎక్సైజ్ కార్యాలయానికి చెప్పగానే జీపుల్లో ప్రత్యక్షమై పోతున్నారు. అమ్ముతున్న వారితో ప్రత్యేక ఒప్పందాలు కుదుర్చు కుంటున్నారు. రిపబ్లిక్ దినోత్సవం రోజు బ్లూ హెవన్ బార్‌లో భారీగా సరుకుందని సమాచారం అందడంతో తరలి వచ్చిన అధికారులు 11 కేసుల బీరు, 4 కేసుల వివిధ రకాల బ్రాందీని స్వాధీనం చేసుకొన్నారు. కాని ఈ బార్ బడా బాబులకు సంబంధించినదిగనుక కేసును రిజిష్టర్ చేయడం, సరుకులు కోర్టులో అప్పగించడం వంటి పనులు చేయడానికి ధైర్యం చాలలేదు. మళ్లీ నోరెత్తకుండా బార్ యజమానులు కూడా వారి జేబులు నింపి నట్లున్నారు. విలేఖరులు అడిగితే దాడిలో ఖాళీ సీసాలు మాత్రమే దొరికినట్లు చెప్పి తప్పించుకొన్నారు. ఆ రోజే నర్సింగరావు పేట, బనిగి సాహెబ్ పేట, అశోక్ నగర్‌లలో తాగి తందనాలు ఆడుతున్నారని నలుగురు సామాన్యులను అరెస్ట్ చేసి తమ ప్రతిభ చాటారు. తామేదో పని చేస్తున్నామని పది మంది భావించేలా ప్రతిరోజూ మద్రాస్ నుండి రైళ్లలో వచ్చే వారిని రైల్వే స్టేషన్‌లో విసిగిస్తున్నారు. కల్తీ కల్లు, గంజాయి వినియోగం టౌన్‌లో తీవ్రంగా వున్నా దాని గురించే పట్టించు కోవడం లేదు.

### అధ్వాన్న స్థితిలో రాపూరు రోడ్లు

రాపూరు నుండి వివిధ ప్రాంతాలకు వెళ్లే రోడ్లు అత్యంత అధ్వాన్న స్థితిలో వున్నాయి. ఇక్కడ నుండి వెంకటగిరి, గూడూరు, నెల్లూరు, పెంచలకోన, కడపలకు వెళ్లే రోడ్లు గుంటల మయమై రోడ్డుపై ప్రయాణించే వారికి నరకాన్ని గుర్తుకు తెస్తున్నాయి. రోడ్లు భవనాల శాఖాధికారులు మరమ్మత్తుల విషయం కూడా మరచిపోయి నట్లున్నారు. ప్రధాన రహదారులు ఇంత అధ్వాన్నంగా వుంటే గ్రామీణ ప్రాంతాలకు వెళ్లే రహదారులను వర్ణించను అక్షరాలు చాలవు. ఇటీవల పడిన వర్షాలకు అవి నుజ్జు నుజ్జుగా మారాయి. కొత్త ఎమ్మెల్యే ఈ మార్గాలన్నింటి మీద ఒకసారి పర్యటించి పరిస్థితి చక్క దిద్దాలని రాపూరు వాసులు కోరుతున్నారు.

> **అసలు నేరస్తులను వదలి అమాయకులను ఏడ్పిస్తున్నారు!**

### రిజిస్ట్రేషన్ రేట్లు పెరిగాయి!

రెండు రూపాయల కిలో బియ్యం పథకం లోటును పూడ్చు కొనేందుకు ప్రభుత్వం అనేక రకాల నిధుల అన్వేషణలో పడింది. దానిలో భాగంగా రిజిస్ట్రేషన్ రేట్లను పెంచింది. ఇకనుండి ఇండ్ల స్థలాలు, భూములు కొనుగోలుదారుల రిజిస్ట్రేషన్‌ను పాత రేట్లమీద కాకుండా కొత్తగా పెరిగిన రేట్ల ప్రకారం చేయించు కోవాలి. ఇప్పటికే పెరిగివున్న రేట్లను ప్రజలు భరించలేక రిజిస్ట్రేషన్లకు బదులు అగ్రిమెంట్లకే పరిమితమై వున్నారు. పెరిగిన రేట్ల ప్రకారం రిజిస్టరు చేసుకోవాలంటే భయపడుతున్నారు. ఇళ్లస్థలాల రిజిస్ట్రేషను 40 శాతం వరకు పెంచడం వల్ల పెక్కు సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ భారం భరించలేక స్థలాలు కొనేవారు అగ్రిమెంట్లు మాత్రమే రాయించుకొని పంచాయతీ పన్నుల రశీదుల్లో తమ పేరు నమోదు చేసుకొనే విధంగా కొత్త మార్గాలు వెతుక్కోవడం మినహా వేరే గత్యంతరం లేకుండా పోతోంది.

### భవానమ్మకు యూత్ అవార్డ్

జిల్లా మహిళా కాంగ్రెస్ కార్యదర్శి, తోటపల్లి గూడూరు చైతన్య మహిళా మండలి అధ్యక్షురాలు మన్నెం భవానమ్మకు రాష్ట్ర యూత్ అవార్డు లభించింది. వివేకానందుని జన్మ దినాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లో రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ మంత్రి ప్రణయ భాస్కర్ దీన్ని ప్రదానం చేశారు. నెల్లూరు భక్తవత్సల నగర్‌లో కాపురముండే భవానమ్మ తోటపల్లి గూడూరు మహిళా మండలి స్థాపించి సారా వ్యతిరేకోద్యమం, పొదుపు లక్ష్మి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొని పుద్యమ విజయాలకు అవిరళ కృషి చేశారు.



పదవీ విరమణ చేసిన కనుపర్తిపాడు హై స్కూల్ హెడ్మాస్టర్ పరబ్రహ్మాచారిని సన్మానిస్తున్న రిటైర్డ్ జిల్లా జడ్జి ఎం. గోపాలాచారి

# కొంచెం కష్టపడితే కలికి భగీరథుడే!

మంచినీటికోసం నిత్యం కావలి వాసులు పడే కష్టాల గూర్చి సీరియల్ కథలు వ్రాయవచ్చు. పంప్‌హౌస్‌ల ద్వారానే నీటి సరఫరా జరుగు తున్నందువల్ల పట్టణం లోని కొన్ని ప్రాంతాలు మినహా మెజార్టీ ప్రాంతాల్లో నీటికై ప్రజలు అల్లాడుతున్నారు. సమస్య ఎంత తీవ్రంగా వుంటున్నదంటే వానాకాలంలో సైతం ట్యాంకర్ల ద్వారా మంచినీరు సరఫరా చేస్తుంటారు. సమస్య పరిష్కారం సమ్మర్ స్టోరేజి ట్యాంకు. దీనికోసం వంద ఎకరాల స్థలం కావాలి. ప్రాజెక్ట్ ప్రతిపాదించిన అటవీ శాఖ స్థలానికి గత కొన్నేళ్లుగా అడ్డంకులు ఎదురవు తున్నాయి. కేంద్ర ప్రభుత్వం అటవీశాఖ భూమిని అప్పగించేందుకు

## ప్రకటన

నెల్లూరు జిల్లా ముత్తుకూరు గ్రామం లోని నాకు హక్కుభుక్తములు గల సర్వే నెం. 486/1, 487/4ల్లు గల య 6.00 ట్లు మెట్ట భూమిని నేను (1) సోమిశెట్టి సాయిబాబా, (2) దుగ్గ చలమారెడ్డి అనువారలకు రు. 3,30,000/- లకు విక్రయించి వారి వద్ద సదరు సైకం తీసుకొని వారిపేరగాని, వారు కోరిన వారి పేరగాని రిజిష్టరు విక్రయ పత్రం వారు కోరినప్పుడు వ్రాయించి యిచ్చులాగున 2.7.1987 తేదిన విక్రయ అగ్రిమెంటు వ్రాయించి యిచ్చి ఉన్నాను. సదరు ఆస్తిని గురించి రిజిష్టరు విక్రయం వగైరాలు చేయుటకు ఆ రోజునే నేను దుగ్గ రామలింగా రెడ్డి గారి పేర రిజిష్టరు జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ కూడా వ్రాసి యిచ్చి ఉన్నాను. సదరు జనరల్ పవర్ ఆఫ్ అటార్నీని 11.11.1992 తేదిన రద్దు చేసియున్నాను. సదరు భూమిని ఇండ్ల ప్లాట్లగా ఏర్పరచి అందులో ఏడు ప్లాట్లను మాత్రం పైన వివరించిన జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ ఏజెంటు ద్వారా ఇతరులు విక్రయంలు చేయించుకొని ఉన్నారు. నిల్వ ఉన్న భూమిని (ప్లాట్లను) గురించి నాకు (1) సోమిశెట్టి సాయిబాబా, (2) దుగ్గ చలమారెడ్డి గార్లకు తగాదాలు ఏర్పడి ఉభయుల మధ్య పెద్ద మనుషులు రాజీ చేసి అమ్మిన ఏడు ప్లాట్ల పోను కొరవ భూమికి నేను రు.6,00,000/- లు (అక్షరములా ఆరు లక్షల రూపాయలు) వారికి యిచ్చునట్లున్ను వారి పేర ఉన్న 2.7.1987 తేది గల విక్రయ అగ్రిమెంటు వారు రద్దు చేసుకొను లాగున నున్న. పై ఆస్తిలో వారికి ఏలాటి హక్కులు లేనట్లున్ను, నేను సదరు ఆస్తిని నా ఇష్టప్రకారం దాని విక్రయ సంపూర్ణ హక్కులు కలిగి అనుభవించు కొనునట్లున్ను తీర్మానం చేసినారు. అందుకు నేను అంగీకరించి సదరు సైకం రు. 6,00,000/- లు వారికి 2.3.95 తేదిన యిచ్చి 2.7.1987 తేది గల విక్రయ అగ్రిమెంటును రద్దు చేయించు కొనుటకు నిర్ణయించు కొన్నాను. గాన పైన ఉదహరించిన భూమిలో రిజిష్టరు విక్రయంలు కాబడిన ఏడు ప్లాట్లుగాక మిగతా భూమిలో (ప్లాట్లలో) ఇంకెవరైనా విక్రయ అగ్రిమెంట్లుగాని, రిజిష్టరు విక్రయ పత్రంలు గాని వ్రాయించుకొని ఉన్న యెడల వ్రాయించుకున్న వారు 28.2.1995 లోపల నాకు తెలిపి పరిష్కరించుకో వలసినది. లేని యెడల ఏలాటి విక్రయ అగ్రిమెంట్ల వగైరాలు ఉన్నను అట్టివి చెల్లనేర వనిన్ని, నన్నుగాని పై ఆస్తినిగాని బద్ధపరచవనిన్ని యిందు మూలకముగా తెలియజేయడమైనది.

ముత్తుకూరు
29.1.95

**ఈదూరు రామమోహన రెడ్డి**
ముత్తుకూరు గ్రామం, నెల్లూరు జిల్లా

# చక్కెర ఫ్యాక్టరీ మూత ఖాయం!

చెరకు కొనుగోలు పన్ను విధించడం ప్రభుత్వ రంగాల్లోని కర్మాగారాల పాలిట పిడుగు పాటుగా వుంది. ప్రతిపక్షాల నుంచి ప్రతిఘటన ఎదురౌతున్నా ఈ సమస్యపై వాస్తవ పరిస్థితులను పరిశీలించ కుండా ప్రభుత్వం నిర్ణయం తీసుకొన్నది. దేశంలోని ఏ రాష్ట్రంలో లేని విధంగా ఆంధ్రప్రదేశ్‌లో కొనుగోలు పన్నును టన్నుకు రు 90 లుగా నిర్ణయించారు. గుజరాత్ టన్నుకు 24 రూపాయలు, హర్యానా 15, మహారాష్ట్ర 22, తమిళనాడు 5 రూపాయలు వసూలు చేస్తున్నాయి. ఖాళీ అవుతున్న ఖజానాను నింపే చర్యగా ప్రభుత్వం ఈ నిర్ణయం చేసినట్లుంది. ఇది అమలు లోకి వస్తే అసలే తీవ్ర ఆర్థిక ఇబ్బందులు, అప్పుల ఊబిలో వున్న సహకార రంగాల్లోని కర్మాగారాలు మూత పడక తప్పదనే చెప్పాలి.

మామూలుగా కేంద్ర ప్రభుత్వం ఆధీనంలోని బి.ఐ.సి.పి. సంస్థ లెవీ చక్కెర ధర నిర్ణయించేందుకు నాలుగు సంవత్సరాల కొకసారి సర్వే జరిపి ధర నిర్ణయిస్తుంది. ఈ ప్రకారం 93 లో సర్వే జరిపి ధర నిర్ణయించారు. 97 వరకు లెవీ చక్కెర ధర పెంచకూడదు. కాని ప్రభుత్వం ఈ సాంప్రదాయాన్ని తుంగలో త్రొక్కివేసింది. చక్కెర ఫ్యాక్టరీలే భారమంతా భరించ వలసి వస్తుంది. ఈ విధానం వల్ల ప్రభుత్వానికి కోవూరు షుగర్ ఫ్యాక్టరీ 2 కోట్ల 10 లక్షల రూపాయల పన్నును ఇప్పటివరకు చెల్లిస్తోంది; కొత్త కొనుగోలు పన్ను వల్ల ఈ భారం 7 కోట్లకు చేరుతుంది. ఇప్పటికే టన్ను చక్కెర ఉత్పత్తి ధర కన్వర్షన్ ఛార్జీలతో కలుపుకొంటే 966 రూపాయలు అవుతున్నది. కాని లెవీ చక్కెర ధర మాత్రం క్వింటాలుకు 690 రూపాయలే. ఏది ఏమైనా ఫ్యాక్టరీలు రైతులకు ఈ విధానంలో గిట్టుబాటు ధర చెల్లించ లేక మూత బడడం ఖాయం. ప్రభుత్వం ఈ విధానాన్ని పునరాలోచించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

> **కొనుగోలు పన్ను చెరకు రైతుల పాలిట ఉరిత్రాడు!**

- సామంతు సుబ్బారెడ్డి



అసలైనవెండిజరీచీరలకుప్రసిద్ధిగాంచినషోరూం
మిమ్మల్ని ఆహ్వానిస్తోంది

వ్యవస్థాపకులు



కీ.శే. శ్రీ కొంజేటి వెంకయ్య

శుభప్రారంభం

గురువారం 9-2-95

నలభై అయిదేళ్ళ విశ్వసనీయతతో,
విజయపరంపరతో సింహపురి మహిళల
అభిమానాన్ని చూరగొని,
కంచిపట్టుచీరల ప్రత్యేక నిలయంగా
ప్రఖ్యాతిచెందిన

## మోహినీ స్టోర్స్

ఆధునిక యువతుల మనోభావాలపై
సమ్మోహనాస్త్రం ప్రసరించేరీతిలో
అధునాతన సెంట్రలైజ్డ్ ఎ.సి.
షోరూంతో ముస్తాబై విస్తృత శ్రేణిలో
ప్రత్యేక పట్టుచీరల విభాగము[illegible]
ప్రారంభిస్తున్న శుభ సందర్భంగా
మీకిదే
మా హృదయపూర్వక ఆహ్వానం

షోరూం ప్రారంభకులు
గౌ. శ్రీ సి. రమేష్‌బాబు,
బ్రాంచిమేనేజర్, కర్ణాటక బ్యాంకులిమిటెడ్ నెల్లూరు.

ప్రారంభ శుభసందర్భంగా
**9/2/95**
(ఒక్కరోజు మాత్రం)

**20 %**
డిస్కౌంట్

స్థాపితం : 1949

# మోహిని స్టోర్స్

ట్రంకురోడ్డు - నెల్లూరు - 1 ఫోన్: 29662.



పదవీ విరమణ చేసిన కనుపర్తిపాడు హై స్కూల్ హెడ్మాస్టర్ పరబ్రహ్మాచారిని సన్మానిస్తున్న రిటైర్డ్ జిల్లా జడ్జి ఎం. గోపాలాచారి

జిల్లావార్తలు

# గూడూరు త్రాగుబోతులకు ఎక్సైజ్ అధికార్లే రక్ష!

నిన్న, మొన్నటి వరకు ప్రభుత్వ శాఖల్లో ఎక్సైజ్ శాఖ లంచ గొండులకు బంగారు బాతు. ఇప్పుడది బంగారు గనిగా మారిపోయింది. త్రవ్వే కొద్దీ లంచాలు పసిడి ముద్దలు వస్తూనే వున్నాయి అధికారులకు! శాసనాధికారాలిచ్చిన చట్టాన్ని అర్థం పెట్టుకొని, దట్టున్న మందు బాబులకు సలాములు చేస్తూ సామాన్యులను వేధించడం గూడూరు ఎక్సైజ్ అధికారులకు దినచర్యగా మారింది. మద్య నిషేధం విధించి రెండు వారాలు గడచినా గూడూరులో మందు బాబులకు ఏ లోటూ లేకుండా సరుకు దొరుకుతూంది. అమాయకులెవరైనా ఫలానా చోట మధుపానం జరుగుతుందని ఫోన్ చేసి ఎక్సైజ్ కార్యాలయానికి చెప్పగానే జీపుల్లో ప్రత్యక్షమై పోతున్నారు. అమ్ముతున్న వారితో ప్రత్యేక ఒప్పందాలు కుదుర్చు కుంటున్నారు. రిపబ్లిక్ దినోత్సవం రోజు బ్లూ హెవన్ బార్‌లో భారీగా సరుకుందని సమాచారం అందడంతో తరలి వచ్చిన అధికారులు 11 కేసుల బీరు, 4 కేసుల వివిధ రకాల బ్రాందీని స్వాధీనం చేసుకొన్నారు. కాని ఈ బార్ బడా బాబులకు సంబంధించినదిగనుక కేసును రిజిష్టర్ చేయడం, సరుకులు కోర్టులో అప్పగించడం వంటి పనులు చేయడానికి ధైర్యం చాలలేదు. మళ్లీ నోరెత్తకుండా బార్ యజమానులు కూడా వారి జేబులు నింపి నట్లున్నారు. విలేఖరులు అడిగితే దాడిలో ఖాళీ సీసాలు మాత్రమే దొరికినట్లు చెప్పి తప్పించుకొన్నారు. ఆ రోజే నర్సింగరావు పేట, బనిగి సాహెబ్ పేట, అశోక్ నగర్‌లలో తాగి తందనాలు ఆడుతున్నారని నలుగురు సామాన్యులను అరెస్ట్ చేసి తమ ప్రతిభ చాటారు. తామేదో పని చేస్తున్నామని పది మంది భావించేలా ప్రతిరోజూ మద్రాస్ నుండి రైళ్లలో వచ్చే వారిని రైల్వే స్టేషన్‌లో విసిగిస్తున్నారు. కల్తీ కల్లు, గంజాయి వినియోగం టౌన్‌లో తీవ్రంగా వున్నా దాని గురించే పట్టించు కోవడం లేదు.

## అధ్వాన్న స్థితిలో రాపూరు రోడ్లు

రాపూరు నుండి వివిధ

> **అసలు నేరస్తులను వదలి అమాయకులను ఏడ్పిస్తున్నారు!**

ప్రాంతాలకు వెళ్లే రోడ్లు అత్యంత అధ్వాన్న స్థితిలో వున్నాయి. ఇక్కడ నుండి వెంకటగిరి, గూడూరు, నెల్లూరు, పెంచలకోన, కడపలకు వెళ్లే రోడ్లు గుంటల మయమై రోడ్డుపై ప్రయాణించే వారికి నరకాన్ని గుర్తుకు తెస్తున్నాయి. రోడ్లు భవనాల శాఖాధికారులు మరమ్మత్తుల విషయం కూడా మరచిపోయి నట్లున్నారు. ప్రధాన రహదారులు ఇంత అధ్వాన్నంగా వుంటే గ్రామీణ ప్రాంతాలకు వెళ్లే రహదారులను వర్ణించను అక్షరాలు చాలవు. ఇటీవల పడిన వర్షాలకు అవి నుజ్జు నుజ్జుగా మారాయి. కొత్త ఎమ్మెల్యే ఈ మార్గాలన్నింటి మీద ఒకసారి పర్యటించి పరిస్థితి చక్క దిద్దాలని రాపూరు వాసులు కోరుతున్నారు.

## రిజిస్ట్రేషన్ రేట్లు పెరిగాయి!

రెండు రూపాయల కిలో బియ్యం పథకం లోటును పూడ్చు కొనేందుకు ప్రభుత్వం అనేక రకాల నిధుల అన్వేషణలో పడింది. దానిలో భాగంగా రిజిస్ట్రేషన్ రేట్లను పెంచింది. ఇకనుండి ఇండ్ల స్థలాలు, భూములు కొనుగోలుదారుల రిజిస్ట్రేషన్‌ను పాత రేట్లమీద కాకుండా కొత్తగా పెరిగిన రేట్ల ప్రకారం చేయించు కోవాలి. ఇప్పటికే పెరిగివున్న రేట్లను ప్రజలు భరించలేక రిజిస్ట్రేషన్లకు బదులు అగ్రిమెంట్లకే పరిమితమై వున్నారు. పెరిగిన రేట్ల ప్రకారం రిజిస్టరు చేసుకోవాలంటే భయపడుతున్నారు. ఇళ్లస్థలాల రిజిస్ట్రేషను 40 శాతం వరకు పెంచడం వల్ల పెక్కు సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ భారం భరించలేక స్థలాలు కొనేవారు అగ్రిమెంట్లు మాత్రమే రాయించుకొని పంచాయతీ పన్నుల రశీదుల్లో తమ పేరు నమోదు చేసుకొనే విధంగా కొత్త మార్గాలు వెతుక్కోవడం మినహా వేరే గత్యంతరం లేకుండా పోతోంది.

## భవానమ్మకు యూత్ అవార్డ్

జిల్లా మహిళా కాంగ్రెస్ కార్యదర్శి, తోటపల్లి గూడూరు చైతన్య మహిళా మండలి అధ్యక్షురాలు మన్నెం భవానమ్మకు రాష్ట్ర యూత్ అవార్డు లభించింది. వివేకానందుని జన్మ దినాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లో రాష్ట్ర యువజన సర్వీసుల శాఖ మంత్రి ప్రణయ భాస్కర్ దీన్ని ప్రదానం చేశారు. నెల్లూరు భక్తవత్సల నగర్‌లో కాపురముంటే భవానమ్మ తోటపల్లి గూడూరు మహిళా మండలి స్థాపించి సారా వ్యతిరేకోద్యమం, పొదుపు లక్ష్మి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొని వుద్యమ విజయాలకు అవిరళ కృషి చేశారు.

# చక్కెర ఫ్యాక్టరీ మూత ఖాయం!

చెరకు కొనుగోలు పన్ను విధించడం ప్రభుత్వ రంగాల్లోని కర్మాగారాల పాలిట పిడుగు పాటుగా వుంది. ప్రతిపక్షాల నుంచి ప్రతిఘటన ఎదురౌతున్నా ఈ సమస్యపై వాస్తవ పరిస్థితులను పరిశీలించ కుండా ప్రభుత్వం నిర్ణయం తీసుకొన్నది. దేశంలోని ఏ రాష్ట్రంలో లేని విధంగా ఆంధ్రప్రదేశ్‌లో కొనుగోలు పన్నును టన్నుకు రు 90 లుగా నిర్ణయించారు. గుజరాత్ టన్నుకు 24 రూపాయలు, హర్యానా 15, మహారాష్ట్ర 22, తమిళనాడు 5 రూపాయలు వసూలు చేస్తున్నాయి. ఖాళీ అవుతున్న ఖజానాను నింపే చర్యగా ప్రభుత్వం ఈ నిర్ణయం చేసినట్లుంది. ఇది అమలు లోకి వస్తే అసలే తీవ్ర ఆర్థిక ఇబ్బందులు, అప్పుల వూబిలో వున్న సహకార రంగాల్లోని కర్మాగారాలు మూత పడక తప్పదనే చెప్పాలి.

మామూలుగా కేంద్ర ప్రభుత్వం ఆధీనంలోని బి.ఐ.సి.పి. సంస్థ లెవీ చక్కెర ధర నిర్ణయించేందుకు నాలుగు

> **కొనుగోలు పన్ను చెరకు రైతుల పాలిట ఉరిత్రాడు!**

సంవత్సరాల కొకసారి సర్వే జరిపి ధర నిర్ణయిస్తుంది. ఈ ప్రకారం 93 లో సర్వే జరిపి ధర నిర్ణయించారు. 97 వరకు లెవీ చక్కెర ధర పెంచకూడదు. కాని ప్రభుత్వం ఈ సాంప్రదాయాన్ని తుంగలో త్రొక్కివేసింది. చక్కెర ఫ్యాక్టరీలే భారమంతా భరించ వలసి వస్తుంది. ఈ విధానం వల్ల ప్రభుత్వానికి కోవూరు షుగర్ ఫ్యాక్టరీ 2 కోట్ల 10 లక్షల రూపాయల పన్నును ఇప్పటివరకు చెల్లిస్తోంది; కొత్త కొనుగోలు పన్ను వల్ల ఈ భారం 7 కోట్లకు చేరుతుంది. ఇప్పటికే టన్ను చక్కెర ఉత్పత్తి ధర కన్వర్షన్ ఛార్జీలతో కలుపుకొంటే 966 రూపాయలు అవుతున్నది. కాని లెవీ చక్కెర ధర మాత్రం క్వింటాలుకు 690 రూపాయలే. ఏది ఏమైనా ఫ్యాక్టరీలు రైతులకు ఈ విధానంలో గిట్టుబాటు ధర చెల్లించ లేక మూత బడడం ఖాయం. ప్రభుత్వం ఈ విధానాన్ని పునరాలోచించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

**- సామంతు సుబ్బారెడ్డి**

# కొంచెం కష్టపడితే కలికి భగీరథుడే!

మంచినీటికోసం నిత్యం కావలి వాసులు పడే కష్టాల గూర్చి సీరియల్ కథలు వ్రాయవచ్చు. పంప్‌హౌస్‌ల ద్వారానే నీటి సరఫరా జరుగు తున్నందువల్ల పట్టణం లోని కొన్ని ప్రాంతాలు మినహా మెజార్టీ ప్రాంతాల్లో నీటికై ప్రజలు అల్లాడుతున్నారు. సమస్య ఎంత తీవ్రంగా వుంటున్నదంటే వానాకాలంలో సైతం ట్యాంకర్ల ద్వారా మంచినీరు సరఫరా చేస్తుంటారు. సమస్య పరిష్కారం సమ్మర్ స్టోరేజి ట్యాంకు. దీనికోసం వంద ఎకరాల స్థలం కావాలి. ప్రాజెక్ట్ ప్రతిపాదించిన అటవీ శాఖ స్థలానికి గత కొన్నేళ్లుగా అడ్డంకులు ఎదురవు తున్నాయి. కేంద్ర ప్రభుత్వం అటవీశాఖ భూమిని అప్పగించేందుకు

## ప్రకటన

నెల్లూరు జిల్లా ముత్తుకూరు గ్రామం లోని నాకు హక్కుభుక్తములు గల సర్వే నెం. 486/1, 487/4ర్లు గల య 6.00 ట్లు మెట్ట భూమిని నేను (1) సోమిశెట్టి సాయిబాబా, (2) దుగ్గ చలమారెడ్డి అనువారలకు రు. 3,30,000/- లకు విక్రయించి వారి వద్ద సదరు పైకం తీసుకొని వారిపేరగాని, వారు కోరిన వారి పేరగాని రిజిష్టరు విక్రయ పత్రం వారు కోరినప్పుడు వ్రాయించి యిచ్చులాగున 2.7.1987 తేదిన విక్రయ అగ్రిమెంటు వ్రాయించి యిచ్చి ఉన్నాను. సదరు ఆస్తిని గురించి రిజిష్టరు విక్రయం వగైరాలు చేయుటకు ఆ రోజునే నేను దుగ్గ రామలింగా రెడ్డి గారి పేర రిజిష్టరు జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ కూడా వ్రాసి యిచ్చి ఉన్నాను. సదరు జనరల్ పవర్ ఆఫ్ అటార్నీని 11.11.1992 తేదిన రద్దు చేసియున్నాను. సదరు భూమిని ఇండ్ల ప్లాట్లగా ఏర్పరచి అందులో ఏడు ప్లాట్లను మాత్రం పైన వివరించిన జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ ఏజెంటు ద్వారా ఇతరులు విక్రయంలు చేయించుకొని ఉన్నారు. నిల్వ ఉన్న భూమిని (ప్లాట్లను) గురించి నాకు (1) సోమిశెట్టి సాయిబాబా, (2) దుగ్గ చలమారెడ్డి గార్లకు తగాదాలు ఏర్పడి ఉభయుల మధ్య పెద్ద మనుషులు రాజీ చేసి అమ్మిన ఏడు ప్లాట్ల పోను కొరవ భూమికి నేను రు.6,00,000/- లు (అక్షరములా ఆరు లక్షల రూపాయలు) వారికి యిచ్చునట్లున్ను వారి పేర ఉన్న 2.7.1987 తేది గల విక్రయ అగ్రిమెంటు వారు రద్దు చేసుకొను లాగున నున్న, పై ఆస్తిలో వారికి ఏలాటి హక్కులు లేనట్లున్ను, నేను సదరు ఆస్తిని నా ఇష్టప్రకారం దాని విక్రయ సంపూర్ణ హక్కులు కలిగి అనుభవించు కొనునట్లున్ను తీర్మానం చేసినారు. అందుకు నేను అంగీకరించి సదరు పైకం రు. 6,00,000/- లు వారికి 2.3.95 తేదిన యిచ్చి 2.7.1987 తేది గల విక్రయ అగ్రిమెంటును రద్దు చేయించు కొనుటకు నిర్ణయించు కొన్నాను. గాన పైన ఉదహరించిన భూమిలో రిజిష్టరు విక్రయంలు కాబడిన ఏడు ప్లాట్లుగాక మిగతా భూమిలో (ప్లాట్లలో) ఇంకెవరైనా విక్రయ అగ్రిమెంట్లుగాని, రిజిష్టరు విక్రయ పత్రంలు గానీ వ్రాయించుకొని ఉన్న యెడల వ్రాయించుకున్న వారు 28.2.1995 లోపల నాకు తెలిపి పరిష్కరించుకో వలసినది. లేని యెడల ఏలాటి విక్రయ అగ్రిమెంట్ల వగైరాలు ఉన్నను అట్టివి చెల్లనేర వనిన్ని, నన్నుగాని పై ఆస్తినిగాని బద్ధపరచవనిన్ని యిందు మూలకముగా తెలియజేయడమైనది.

ముత్తుకూరు
29.1.95

**ఈదూరు రామమోహన రెడ్డి**
ముత్తుకూరు గ్రామం, నెల్లూరు జిల్లా

# నెల్లూరు వాచ్యేలిస్ట్

## విమర్శకుడు

### జనార్దన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎన్. జనార్దన రెడ్డి నెల్లూరు పర్యటనలో వున్నారు. ఈరోజు (3 తేది) వెంకటగిరి ; రేపు నెల్లూరు వస్తారు. 6 తేది వరకు జిల్లాలోనే పర్యటిస్తారు.

### కలెక్టర్ బదలీ - జిల్లా అంతా అసంతృప్తి!

జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు బదలీ నిర్ణయం జిల్లా అంతటా నిరసన ధ్వనులను విన్పింప చేస్తున్నది. ఆయన్ను హైదరాబాద్ లోని సిరికల్చరల్ డైరెక్టర్‌గా బదలీ చేసి, ఇక్కడ ఆరోగ్య శాఖలో వున్న పంజాబీయుడు ప్రేమ్‌చంద్‌ను నియమించారు. ప్రేమ్‌చంద్‌కు కలెక్టర్‌గా తొలి పోస్టింగ్ ఇది. సాంబశివ రావుగారు ఈ రోజు (3 తేది) జాయింట్ కలెక్టర్‌కు బాధ్యతలు అప్పు చెప్పి, రిలీవ్ అవుతున్నారు. సాంబశివ రావుగారు జిల్లాలో నాలుగు సంవత్సరాలా నాలుగు నెలలు పనిచేశారు. జెసిగా వచ్చారాయన ఇక్కడకు; ఇక్కడ్నే కలెక్టర్ ప్రమోషన్ పొందారు.

ఆయన బదలీ పట్ల ఇటు రాజకీయ వాదులలోను, అటు సాధారణ ప్రజలలోనూ అసంతృప్తి, నిరసన వ్యక్తమౌ తున్నాయి. కప్పరాళ్ల తిప్ప వాసులు ఒకరోజు నేషనల్ హైవేపై ట్రాఫిక్ బంద్ చేసి, రాస్తారోకో నిర్వహించారు. టౌన్ పరిసర గ్రామాల మహిళలు ఈరోజు (3 తేది) కలెక్టరేట్ ఎదుట ధర్నా చేస్తున్నారు. కలెక్టర్‌గా సాంబశివ రావుగారి జనరంజకతకు ఇవి ఉదాహరణలు మాత్రమే. ఆయన జాయింట్ కలెక్టర్‌గా నెల్లూరు వచ్చేటప్పటికి, అప్పటి కలెక్టర్ శ్రీ కె.రాజు అక్షరాస్యతా ఉద్యమం ప్రారంభించి వున్నారు. మాననీయమైన, మహోన్నతమైన ఆశయంతో, సంకల్ప బలంతో, దీక్షతో పల్లె ప్రజల్లో చైతన్య దీపాలు వెలిగించ డానికి రాత్రింబవళ్లు తేడా లేకుండా శ్రమిస్తుండినారు. ఆ సమయంలో జెసిగా రావడంతో, ఆయన సైతం అందులో నిమగ్నమై పోయారు. అక్షరాస్యతా ఉద్యమం, సారాయి నిషేధ చైతన్యంగా పరిణమించి నప్పుడు దాన్ని మరింత ఉద్దీపింప చేయవలసిన బాధ్యత సాంబశివ రావుపై పడింది. ఆ బాధ్యత నాయన సంతోషంగా స్వీకరించి, సమర్థవంతంగా పోషించారు. సారా ఉద్యమ చరిత్రలో కె.రాజు, సాంబశివ రావుల పేర్లు సువర్ణాక్షర లిఖితాలన దగిన రీతిలో వ్యవహరించారు వారు. మద్య నిషేధ లక్ష్యం నెరవేరగానే, జనంలో రేకెత్తిన జాగృతి చల్లారి పోకుండా పొదుపు లక్ష్మి ఉద్యమం ప్రారంభించి మహిళల అభిమానం చూరగొన్నారు. ఆ అంకిత భావం, ఆ సేవా స్ఫూర్తి, ఆ ఆశయ నిబద్ధత సాంబశివ రావును జనంలోకి తీసుకు వెళ్లాయి; జన రంజకతను సమకూర్చి పెట్టాయి.

నిజాయితీ, నిరాడంబరత, నగుమోము, నిష్కల్మశత్వం, మృదు భాషణం వంటి సుగుణాలు సాంబశివ రావు వ్యక్తిత్వ వైశిష్ట్యాలు. కలెక్టర్‌గా ఆయన ఇక్కడ ఎల్లకాలం వుండలేరు. అధికారికి బదలీ సర్వ సాధారణం. ఆయన్ను అంత త్వరితంగా వదులు కోవలసి రావడం బాధాకరమైనా, జిల్లా ప్రజలందరూ ఆయనకు హార్దికంగా వీడ్కోలు చెప్పడం బాగుంటుంది.

బదలీపై రాద్ధాంతం వ్యర్థం!

సాంబశివ రావు గారిని మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి బదలీ చేయించారని; ఎమ్మెల్యే శ్రీ బల్లి దుర్గా ప్రసాద్ ముఖ్యమంత్రికి చేసిన ఫిర్యాదు వల్ల బదలీ జరిగిందని పలు రకాల వార్తలు వస్తున్నాయి. ఇక్కడే వుండాలని సాంబశివ రావుగారు పట్టుబడితే కదా - ఆ రాజకీయ వివాదాలకు విలువ. అందువల్ల వాటిపై చర్చ అనవసరం. అయితే మంత్రి శ్రీ ఎన్. ప్రసన్న కుమార్ రెడ్డి ఇటువంటి పొరపాటు పని చేసి వుంటారని కోలేము.

సాంబశివ రావు గారికి జమీన్‌రైతు అభినందనలతో వీడ్కోలు చెప్తున్నది.

### వేమారెడ్డి పార్టీ మార్పు- దేశంలో కలకలం

కో ఆపరేటివ్ బ్యాంక్ మాజీ ఛైర్మన్ శ్రీ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి తెలుగుదేశం పార్టీలో చేరిక చాలా వివాదాస్పదమై పోయింది. ఇటు ఎమ్మెల్యే శ్రీ యల్లసిరి శ్రీనివాసులు రెడ్డి ఈ చేరికను వ్యతిరేకిస్తున్నారు. ఇంకొక ప్రక్క కిరణ్‌కుమార్ వంటి యువజన నాయకులు తీవ్ర స్థాయిలో ప్రతి ఘటిస్తున్నారు. చేరికకు ముందు, ఒక శాసన సభ్యుడు వేమారెడ్డి తన పార్టీలోకి రావడాన్ని నిరసిస్తానని చెప్పడం తోపాటు, నెల్లూరు వెళ్లగానే వరగలిలో ఆయన ఆక్రమించిన ప్రభుత్వ భూముల గురించి, రొయ్యల చెరువుల గురించి దర్యాప్తు జరపాలని పత్రికా ప్రకటన చేయబోతున్నట్లు బెదిరించారట. దానితో ఎందుకొచ్చిన న్యూసెన్స్ అని ఆయన తన అల్లుడు, మాజీ పైలట్ శ్రీ సుధాకర రెడ్డి ద్వారా ఎన్‌టిఆర్ అపాయింట్‌మెంట్ సంపాదించి చేరిక లాంఛనం పూర్తి చేశారు. అయితే ఎమ్మెల్యే లెవరూ ఈ హఠాత్ పరిణామం వూహించ లేదు. ఇప్పుడు కల తెలుసుకొని, వేమారెడ్డి అనుచరు లెవరూ పార్టీలోకి రావడానికి లేదని అర్థం పడుతున్నారు. సైన్యాన్ని కౌరవులకు వదలి, తాను మాత్రం పాండవుల పక్షం చేరిన కృష్ణ భగవానుడి వలె తెలుగుదేశం పార్టీలో వంటరివాడై పోయాడు వేమారెడ్డి రామచంద్రా రెడ్డి. ఎన్నికల సమయంలో ధన సహాయం చేశారన్న కృతజ్ఞతతో బల్లి దుర్గా ప్రసాద్, వెంకటగిరి రాజా మాత్రం ఆయన పట్ల సానుభూతితో వున్నారు.

1 తేది రాత్రి గూడూరులో రైలెక్కడానికి, ఆగిన మంత్రి ముద్దు కృష్ణమ నాయుడి సమక్షంలో ఈ విషయమై పెద్ద రభస జరిగింది. వేమారెడ్డి అనుచరులను పార్టీ లోకి తెస్తే ఇంతకాలం ఆదే కాంగ్రెస్ వారుల చేత అష్ట కష్టాలు పడిన తమ గతి ఏమిటని నిలదీశారు. మంత్రిగారు ఏటూ చెప్పలేక పోయారు పాపం. ఒక దశలో నేవూరు విజయ మోహన రెడ్డి, కిరణ్ కుమార్ మనుషుల మధ్య ఘర్షణ జరిగింది. చొక్కాలు చించుకొన్నారు. పోలీసు వచ్చి సర్ది పెట్టవలసి వచ్చింది. దుర్గా ప్రసాద్ మాత్రం ముఖం తప్పించేశారు.

ఎంతటి వేమారెడ్డికి ఎటువంటి గతి పట్టిందండి?







'సహస్ర మాసోపజీవి' అయిన ఆనం వెంకట రెడ్డి గారిని, ఆయన సతీమణిని సత్కరిస్తున్న ఆనం సంజీవరెడ్డి

### ఆనం వెంకటరెడ్డి సహస్రమాసోప జీవి

మాజీ మంత్రి ఆనం వెంకట రెడ్డి సహస్ర మాసోపజీవి అయ్యారు. ఆయనకు 85 సంవత్సరాలు నిండాయి. 85 సంవత్సరాలంటే వెయ్యి నెలల వయస్సు. మరొక రూపంలో చెప్పాలంటే ఆయన వెయ్యి పున్నములను దర్శించా డనాలి. నెల్లూరు జిల్లా ప్రముఖులలో డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి, డాక్టర్ మరుపూరు కోదండ రామిరెడ్డిలు మాత్రమే ఈ అదృష్టానికి నోచుకున్నారు.

కొరవ 8 పేజీలో



రాష్ట్ర యూత్ అవార్డును యువజన సర్వీసుల శాఖామంత్రి ప్రణయ భాస్కర్ నుండి అందుకొంటున్న తోటపల్లిగూడూరు చైతన్య మహిళా మండలి అధ్యక్షురాలు మన్నెం భవానమ్మ

## జిల్లా వార్తలు

5 పేజీ కొరవ

ఇప్పుడు గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. జువ్వల పాళెం ఫారెస్ట్ ఏరియాలో ఆరున్నర కోట్ల రూపాయలతో ఈ ట్యాంక్ నిర్మాణం చేపడతారు. ఫారెస్ట్ క్లియరెన్స్ కోసం తాను పడ్డ కష్టాలు ఈశ్వరుడికె తెలుసునని అన్నారు ఎమ్మెల్యే కలికి యానాది రెడ్డి గారు. కావలి ప్రజల దాహార్తిని తీర్చను వెంటనే ఈ పనిని చేపట్టేందుకు రాష్ట్ర ప్రభుత్వం కృషి చేయాలని, దీనికోసం అన్ని పార్టీల నాయకులూ సహకరించాలని యానాదిరెడ్డిగారు కోరారు. సమ్మర్ స్టోరేజి ట్యాంకు మంజూరులో మాజీ ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి, రిటైర్డ్ టౌన్ ప్లానింగ్ డైరెక్టర్ వేణుగోపాల్‌రెడ్డి, కలెక్టర్ ఎం. సాంబశివరావుల కృషి ఎంతో వుందని చెప్పారు. కలికి సామాన్యంగా ఏ విషయాన్నీ సీరియస్‌గా తీసుకోరు. పథకాన్ని త్వరిత గతిన పూర్తి చేయించడంలో ప్రభుత్వాన్ని ఒప్పిస్తే అపర భగీరథునిగా ఆయన పేరు కలకాలం నిలవడం ఖాయం!

## ప్రకటన

### దీ నెల్లూరు కో-ఆపరేటివ్ అర్బన్‌బ్యాంక్ లిమిటెడ్ నం. 2319 నెల్లూరు

ఈ ప్రకటన మూలకంగా తెలియజేయడమేమనగా నెల్లూరు మునిసిపాలిటీలో చేరిన వేదాయపాళెం కాపురస్థురాలు వడ్లమూడి సూర్య ప్రభావతిగారు ఈ బ్యాంకు నందు ఆయకపు అప్పు కోరుచూ పెద్యూలు దాఖలా ఆస్తికి సంబంధించిన ఒరిజినల్ ఆస్తి పత్రములు డాక్యుమెంటును 6835/90 మరియు 3518/76 తుఫానులో పోయినవని తెల్పుచూ నకలు పత్రములు దాఖలు చేసియున్నారు. ఇందుకు సంబంధించి ప్రోనోటు బాకీలుగా గాని, ఆదుమానములుగా గాని లేక ఏ యితర అభ్యంతరములు వున్నయెడల ఈ ప్రకటన తేదినుండి 10రోజుల లోపల బ్యాంక్‌వారికి వ్రాతమూలకంగా తెలియజేయకోరడమైనది.

**ఆస్థి పెద్యూలు**

నె.డి.రి. యిలాకా నెల్లూరు మున్సిపాలిటీలో చేరిన వేదాయపాళెం, త్యాగరాజస్వామి దేవాలయం వీధి. ప్రస్తుత ఇంటి నంబరు: 27-1212 అసెస్‌మెంటు నంబరు: 43107 గల [illegible] స్థిరాలకు హద్దులు. తూర్పు: K. రాజగోపాల్‌గారి యిల్లు; దక్షిణం: రోడ్డు; పడమర: పూండ్ల శ్రీనివాసులు రెడ్డి స్థలం; ఉత్తరం: B.సత్యనారాయణ స్థలం.

యీ హద్దులలోని 20 అంకణముల స్థలములో 6 అంకణముల పిమెంటు రేకుల యిల్లు, యీ ఆస్తికి సంబంధించిన సకల యీజామెంటు హక్కులున్ను.

K.సూర్యనారాయణ JCS అమర్‌నాథ్.
కార్యదర్శి. అధ్యక్షులు

### హెడ్మాస్టర్ పరబ్రహ్మచారి పదవీ విరమణ

కనుపర్తి పాడు జడ్‌పిపి ఉన్నత పాఠశాల ప్రధానో పాధ్యాయునిగా పదవీ విరమణ చేసిన ఆచారం పరబ్రహ్మచారి అభినందన సభ ఇటీవల కామిశెట్టి సుందర రామయ్య శెట్టి సత్రంలో జరిగింది. రిటైర్డ్ జిల్లా న్యాయమూర్తి ఎం. గోపాలాచారి కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. జిల్లా రొయ్యల రైతుల సంఘం కార్యదర్శి పి.షబ్బీర్ ఖాన్ మాట్లాడుతూ పరబ్రహ్మచారి సాహిత్య అభిమానని, సెక్యులర్ భావాలు గల అరుదైన ఉపాధ్యాయుడని ప్రశంసించారు. జాతీయ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత ఆర్.సుబ్రహ్మణ్యం, రాష్ట్ర ప్రభుత్వ అవార్డు గ్రహీత వెంకయ్య ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. డాక్టర్ సుజాతమ్మ, డాక్టర్ వెంకటేశ్వర్లు, కరేటి చంద్రా రెడ్డి, ఎ. షణ్ముఖాచారి తదితరులు ప్రసంగించారు.

### గూడూరులో త్వరలో కాంగ్రెస్ పార్టీ కార్యాలయం

కారు ప్రమాదంలో మరణించిన గూడూరు కాంగ్రెస్ నాయకుడు చదలవాడ వెంకటేశ్వర్లు కుటుంబాన్ని మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి 1 తేది పరామర్శించారు.

ఈ సందర్భంగా విలేఖరులతో మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీ కార్యాలయాన్ని త్వరలో గూడూరులో ప్రారంభిస్తామని జనార్దనరెడ్డిగారు చెప్పారు. ప్రజా సమస్యలను వినతి పత్రాల ద్వారా అధికారుల దృష్టికి తెచ్చేందుకు పూర్తి స్థాయి పనిచేసే కార్యకర్తలను నియమిస్తా మన్నారు.

**నెల్లూరు ముచ్చట్లు**

7 పేజీ కొరవ

జిల్లా రాజకీయాల్లో ఆనం వెంకట రెడ్డి విలక్షణమైన వ్యక్తి. ఇరవయ్యేళ్ల క్రితం జిల్లాలో తన మాటకు ఎదురు లేకుండా బ్రతికిన వాడు. వయస్సు మీరింది; గౌరవం తగ్గకుండా గుట్టుగా ఇంటి పట్టునే వుండి పోయారు. అన్నేళ్లు రాజకీయాలలో అంత నిరంకుశత్వంగా చలామణీ అయి కూడా, అవినీతికి, అక్రమార్జనకు పాల్పడని నాయకుడు ఆనం వెంకట రెడ్డి.

తమ కుటుంబంలో మొదటిసారిగా సహస్ర మాసోపజీవి అన్పించుకున్న వెంకటరెడ్డి గారిని, ఆయన సతీమణి శ్రీమతి రమణమ్మలను కుటుంబ సభ్యులందరూ కలసి సత్కరించారు. పూజలు, పునస్కారాలు జరిపారు. వెంకట రెడ్డిగారు నూరేళ్లు జీవించాలని మా ఆకాంక్ష.

### అంకయ్య గౌడ్‌కు అన్న నిరాకరణ

పొదలకూరు మాజీ మండలాధ్యక్షుడు శ్రీ రావుల అంకయ్య గౌడ్‌ను పార్టీలో చేర్చుకోవడానికి ఎన్‌టి రామారావు గారు నిరాకరించారు. మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి, ఎమ్మెల్యే శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి కలసి సిఫార్సు చేసినా, సారా వ్యాపారంతో సంపర్కం వుండే వారిని మన పార్టీలోకి ఎట్లా రానిస్తాము బ్రదర్ అని ఎదురు ప్రశ్నించారట. గౌడ్ ఇప్పుడా వ్యాపారం మానివేశాడని చెప్పినా విన్పించు కోలేదట. రెంటికీ చెడిన రేవడై పోయాడు గౌడ్!

### చక్కెర ఫ్యాక్టరీ ఎండి బదలీ

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టర్ కె. సూర్య నారాయణ హైదరాబాదుకు బదలీ అయ్యారు. తెనాలి ఫ్యాక్టరీ నుంచి శ్రీ బత్తి రెడ్డిని ఇక్కడ నియమించారు.

సూర్య నారాయణ సమర్థుడైన అధికారి. సామంతు సుబ్బారెడ్డికి పూర్తి సహకారం అందించి ఫ్యాక్టరీ అభివృద్ధికి పాటుపడిన వాడు. ఒకేసారి అనుభవజ్ఞులైన ఛైర్మన్, ఎండిలను వదలుకున్న చక్కెర ఫ్యాక్టరీ భవిష్యత్ ఏమిటో ఇప్పుడప్పుడే చెప్పలేము.

### కావలిలో అడ్వొకేట్ జనరల్

రాష్ట్ర అడ్వొకేట్ జనరల్ శ్రీ ఎస్. రామచంద్ర రావు 29 తేది కావలికి వచ్చారు. ఆయన కావలి వాసి అట. ఇంతకాలం ఆ విషయం ఎవరికీ తెలియదు. పెద్ద పదవిలోకి రావడం తోటి అందరూ గుర్తు చేసుకున్నారు. కావలి ఛేంబర్ ఆఫ్ కామర్స్, బార్ అసోసియేషన్లు ఆయన్ను సత్కరించాయి. కావలి బార్ అసోసియేషన్‌కు ఆయన 25 వేల విరాళం ప్రకటించారు. వంద కోట్ల రూపాయల పరిశ్రమ ఒకటి కావలిలో నెలకొల్పేటట్లు ప్రభుత్వాన్ని ఒప్పిస్తానని వాగ్దానం చేశారు. టీచర్ల నియామకాలకు సంబంధించి విధాన ప్రకటన చేశారు. న్యాయ పదవిలో వుండి, ప్రభుత్వ ప్రతినిధిగా మాట్లాడడం విచిత్రంగా కన్పించింది.

### దేగా సుందర రామరెడ్డి మరణించారు

జిల్లాలో పేరున్న కంట్రాక్టరు, వివాద రహితుడైన పెద్ద మనిషి శ్రీ దేగా సుందర రామిరెడ్డి 29 తేది మద్రాసు అపోలో ఆస్పత్రిలో మరణించారు. ఆయన వయస్సు 71 సంవత్సరాలు.

అటు కాంట్రాక్టులలోను, అటు రాజకీయాల లోనూ జిల్లాలో గుర్తింపు పొందిన దేగా కుటుంబంలో అగ్రజుడాయన. తమ్ముళ్లిద్దరు - నారసింహా రెడ్డి, రామ గోపాల రెడ్డి రాజకీయ పదవు లనుభవించినా, ఆయనెప్పుడు వాటి జోలికి పోలేదు. తన పనేదో తానేదోగా వుండేవారు. హైదరాబాదులోని వైస్రాయ్ హోటల్ అధినేత దేగా శ్రీనివాసులు రెడ్డి ఆయన ఇద్దరు కుమారులలో ఒకరు. పాత నర్తకి థియేటర్ యజమాని. కాంట్రాక్టుల ద్వారా కుబేరుడైనా గుట్టు చప్పుడు కాకుండా గడిపే గుండ్రా జనార్దన రెడ్డి ఆయన అల్లుడు.

వారి కుటుంబానికి మా సానుభూతి.

### మరణాలు

నెల్లూరులో పాతకాలం పెద్ద డాక్టర్ స్వర్గీయ రాజమన్నార్ కుమారుడు, అడ్వొకేటు శ్రీ కె. వెంకట్రావు 30 తేది మరణించారు. ఆయనకు ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు. ఆయన వయస్సు 65 సంవత్సరాలు.

* * *

నెల్లూరులో ప్రఖ్యాత నిమ్మకాయల వ్యాపారి, సిరిమల్లె గ్రూప్ వ్యాపార సంస్థల భాగస్వామి శ్రీ నల్లపడ్ల శంకర రెడ్డి 28 తేది గుండెపోటుతో హఠాత్తుగా మరణించారు. వయస్సు చిన్నది - 48 ఏళ్లు ; భార్య, ఇద్దరు కుమార్తెలు వున్నారు. గుంటూరు మార్కెటింగ్ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ ఎన్‌వి రమణారెడ్డి ఆయన సోదరుడు.

పై కుటుంబాల వారికి మా సానుభూతి.

### ఎందుకంతభయం

మొదటి పేజీ కొరవ

పరిపాలించినప్పుడు చంద్రబాబు నాయుడు సూపర్ ఛీఫ్ మినిష్టర్‌గా చలామణీ అయిన నాదంతా తెర వెనుక భాగోతం తప్ప ఎప్పుడూ పబ్లిక్‌గా పెత్తనం చేయలేదు. కాని లక్ష్మీపార్వతి గారు మాత్రం తానే ముఖ్యమంత్రి నన్నట్లు వ్యవహరిస్తున్నారు. ప్రజలు ఓట్లేసింది ఎన్‌టి రామారావు గారి నాయకత్వంలోని తెలుగుదేశం పార్టీకి; ప్రజలు కోరింది ఎన్‌టి రామారావు గారి ముఖ్యమంత్రిత్వాన్ని! ఆ వాస్తవం విస్మరించి ఆయన ప్రభుత్వ పగ్గాలను తన భార్య చేతికి అందించి, ప్రజల పై స్వారీ చేయమనడం పూర్తిగా ప్రజాభీష్టానికి విరుద్ధం.

ఒకప్పు విద్యాసాగర రావు చెప్పినట్లు ఆమెను మంత్రిగా నియమించడమో, లేదా తాను ప్రక్కకు తప్పుకొని ముఖ్యమంత్రి పీఠం పై ఆమెను కూర్చుండ బెట్టడమో మేలన్పిస్తున్నది.

అయితే లక్ష్మీపార్వతి ఉద్దేశం కూడా ఇంచు మించు అదిగానే వుందని చెప్తారు. స్థానిక సంస్థల ఎన్నికల తర్వాత, టెక్కలిలో తాను గెలవగానే ఎన్‌టిఆర్‌ను జాతీయ రాజకీయాలలోకి పంపి, తాను ముఖ్యమంత్రి కావాలన్న సంకల్పం ఆమెలో వుందని చెప్తున్నారు. పార్లమెంట్ ఎన్నికలలోగా దేశమంతా పర్యటించి, జాతీయ స్థాయి నాయకుడిగా గుర్తింపు పొందడం అవసరమని ఆమె ఎన్‌టిఆర్‌కు నూరి పోస్తున్నారు. తద్వారా ప్రధాని అయ్యే అవకాశం కల్గుతుందని ఆశ పెడుతున్నారు. ఈ విధంగా పురికొల్పడం వెనుక నిజోద్దేశ్యం తాను ముఖ్యమంత్రి కావాలను కోవడమేనని పరిశీలకుల వూహ. అందువల్లే ఆమె "పరిపాలనలో మగవాళ్ల కంటే ఆడవాళ్లు సమర్థులని చరిత్ర చెప్తున్నది" అనే ప్రకటనను తన వుపన్యాసాలలో తరచు ప్రస్తావిస్తున్నట్లు రాజకీయ పండితుల అభిప్రాయం. టెక్కలి ఉప ఎన్నిక తర్వాత గాని ఆమె నిజ గాపం అర్థం [illegible]దు. ఈలోగా ఎన్ని పరిణామాలు చోటు చేసుకో నున్నాయో వూహకందడం లేదు.

### పబ్లిక్ ఇష్యూలు

2 పేజీ కొరవ

వరకు నగదు రూపంలో దాచి పెట్టబడే నల్లధనం కొన్ని వేల కోట్ల రూపాయల పరిమాణంలో ఈ రంగానికి మరలుతున్నది. వృథా అయ్యే ఈ నిధులు ఇంతగా ఉత్పాదకతను సంతరించు కోవడం ఆర్థిక వ్యవస్థ పరిపుష్టికి ఎంతగానో వుపకరిస్తున్నది.

ఇన్నిన్ని కంపెనీలు తామర తంపరగా పుట్టుకొని వచ్చి, ఇష్యూలు జారీ చేస్తున్నా, వాటిలో ఏ ఒక్కటి కూడా అండర్ సబ్‌స్క్రయిబ్ కాకపోవడం ప్రజలలో వాటికున్న ఆదరణను సూచిస్తున్నది. దాదాపు 90 శాతం కంపెనీలు ఓవర్ సబ్‌స్క్రయిబ్ అవుతున్నాయి. మన రాష్ట్ర రెవిన్యూ మంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు పాల ఉత్పత్తుల తయారీకి స్థాపించిన హెరిటేజ్ ఫుడ్స్ కంపెనీ 52 సార్లు ఓవర్ సబ్‌స్క్రయిబ్ అయింది. దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు ప్రజలలో వీటి పట్ల వున్న క్రేజ్.

### షేర్లు

2 పేజీ కొరవ

వేలు పెడితే చేతులు కాలిపోతాయి. పత్రికలలో షేర్ల గురించి వివిధ రకాల సలహాలు సూచనలు వస్తుంటాయి. వాటిలో ఏ పత్రిక లేదా ఏ విలేఖరి చేసే సూచన సక్రమమైనదో నిర్ణయించు కోవడం కష్టం. పెట్టుబడి పెట్టే వారు పలు మార్గాలలో సమాచారాన్ని సేకరించ గలిగితేనే క్షేమం.

-డాక్టర్.

# శివారెడ్డి పద్యాలు

## గండవరపు రాధాకృష్ణారెడ్డి

(చ్యార్ఫ్యాక్టరీ కొత్త ఛైర్మన్)

రాధాకృష్ణారెడ్డి
ఆదర్శమునీచరిత్ర ఆంధ్రలో, పార్టీ
యిద్రైతేయిమికవులకు
చెరుగాడుపేదసాదక్షేమముముఖ్యం.
పాత్రమెరిగినీకుపట్టమ్ముగట్టింది
త్రాసుబెట్టితూచితరచితరచి
ఆంధ్రకొరతనమ్ముఆరేవాలుపదివేలు
రైతురాజ్యమింకరానురాను!

## పరుగులెత్తేవాణ్ణి

దేవుడన్నగుళ్ళుదేవాలయాలన్న
పరుగులెత్తేవాణ్ణిపరుతులేస్తు
వయసుకొచ్చిఅన్నివదిలిపారేసేక
లేనిపొన్నిక్రమలుదేనికింక.

ఎంతటోడైన ఏటేటకానైతే
ఆడపిల్లపుడితేపొర్తుఫెయిలు
పిల్లవాడుపుడితెయిల్లంతాబంగారు
నిజముబైటబెడితెపెద్దనేరమౌర్థి!

## పెసర

4 పేజీ కొరవ

### పెసర:

| వరిమాగాణిభూముల్లో | ఆరుతడి పంటగా |
|---|---|
| యం.యల్-267 | యం.యల్-267 |
| యల్.జి.జి-407 | యల్.జి.జి-407 |
| యల్.జి.జి-450 | యల్.జి.జి-410 |
| | పి.డి.యమ్-54 |

### మినుము:

| వరిమాగాణి భూముల్లో | ఆరుతడి పంటగా |
|---|---|
| యల్.బి.జి-20 | యల్.బి.జి-20 |
| యల్.బి.జి-623 | యల్.బి.జి623 |
| | యల్.బి.జి-629 |
| | యల్.బి.జి-402 |
| | టి-9 |

ఈ రకాల లక్షణాలను, సాగు పద్ధతులను కూడా పరిశీలించవచ్చు.

### పెసర:

#### యం.యల్-267

అన్ని పంటకాలాలకు అనువై, 60-65రోజుల్లో కోతకు వస్తుంది. దిగుబడి హెక్టారుకు 12-15 క్వింటాళ్లు ఇస్తుంది.

పల్లాకు తెగులు (ఎల్లో మొజాయిక్) ను తట్టుకుంటుంది.

#### 407

కాలపరిమితి 70-75 రోజులు గల్గి, హెక్టారుకు దిగుబడి 14-16 క్వింటాళ్ళ నిస్తుంది. గింజలు పెద్దవిగా మెరుస్తూ వుంటాయి. పల్లాకు తెగులు, నల్ల ఆకు మచ్చ తెగులు, వేరు కుళ్లు తెగుళ్ళను తట్టుకుంటుంది.

#### 410

ఈ రకం 75 రోజుల్లో కోతకు వస్తుంది. దిగుబడి హెక్టారుకు 14-16క్వింటాళ్ళ నిస్తుంది. గింజలు పెద్దవిగా మెరుస్తూ వుంటాయి. పల్లాకు తెగులును, బూడిద తెగులును తట్టుకోగలదు.

#### 450

పుష్కర పేరుతో 1993లో విడుదలైన ఈ రకం పంటకాలం 70-75 రోజులు. దిగుబడి హెక్టారుకు 13-15 క్వింటాళ్లు. కోత దశలో వర్షాలు పడినచో, పైరు మీద కాయలో గింజలు మొలకెత్తవు. పల్లాకు తెగులు, నల్ల ఆకు మచ్చ తెగులను తట్టుకొంటుంది.

#### పి.డి.యం-54

కాలపరిమితి 60-65 రోజులు గల్గి హెక్టారుకు 12-15క్వింటాళ్ళ దిగుబడి నిస్తుంది. [illegible] తట్టుకొంటుంది.

### మినుము

#### యల్.బి.జి-20

తేజా పేరుతో విడుదలైన ఈ రకం పంటకాలం 70-75 రోజులు. దిగుబడికి హెక్టారుకు 14-16 క్వింటాళ్ళ నిస్తుంది. అన్ని కాలాలకు అనువైన పాలిష్‌రకము. పల్లాకు తెగులును తట్టుకొంటుంది.

#### 623

పంటకాలం 75-80 రోజులు. హెక్టారుకు దిగుబడి 16-18 క్వింటాళ్లు. గింజలు మధ్యస్థ పరిమాణంలో నల్లగా మెరుస్తూంటాయి. బూడిద తెగులు, పల్లాకు తెగులును తట్టుకొంటుంది.

#### 629

ఈ రకం కాలపరిమితి 75-80రోజులు దిగుబడి హెక్టారుకు 16-18 క్వింటాళ్ల నిస్తుంది. గింజలు మధ్యస్థ పరిమాణంలో మెరుస్తూ వుంటాయి. పల్లాకు, బూడిద తెగుళ్ళను తట్టుకొంటుంది.

#### 402

ప్రభవ పేరుతో విడుదలైన ఈ రకం కాలపరిమితి 90-95 రోజులు. దిగుబడి హెక్టారునకు 20-22 క్వింటాళ్ల నిస్తుంది. గింజలు లావుగా వుంటాయి. ఎండాకు తెగులును తట్టుకొంటుంది.

#### టి-9

ఈ రకం పంటకాలం 70-75 రోజులు. దిగుబడి హెక్టారుకు 10-15 క్వింటాళ్ళ నివ్వగలదు. గింజలు నల్లగా మధ్యస్థ పరిమాణంలో ఉంటాయి. పల్లాకును కొంతవరకు తట్టుకుంటుంది.

### సాగుపద్ధతులు

#### విత్తుట

వరి మాగాణుల్లో కోతకు 3-4 రోజుల ముందు నీరు బయటకుతీసి పెసర విత్తనాలు ఎకరానికి 12-14 కిలోలు, మినుములు ఎకరానికి 16 కిలోలు చొప్పున పొలమంతా వెదజల్లాలి. అదే ఆరు తడి పైరుగా పొలం దున్ని సాగుచేయుటకైతే 8-10 కిలోల విత్తనం ఎకరానికి సరిపోతుంది. ఆరుతడిపైరుగా మొక్కల మధ్యదూరం 30 x 10 సెం.మీ ఉంటే మంచిది.

#### ఎరువులు

వరి మాగాణుల్లో ఎరువులను వాడవలసిన అవసరం లేదు. ఆరుతడి పైరుగా పొలం దుక్కి దున్ని సాగుచేసే పరిస్థితుల్లో ఎకరానికి 2 టన్నుల పశువుల గెత్తము, ఎకరానికి 8 కిలోల నత్రజని, మరియు 20 కిలోల ఫాస్ఫేటు నిచ్చే ఎరువులను వాడాలి.

#### కలుపు నివారణ

ఆరుతడి పైరులో 30రోజుల వరకు కలుపునుండి పైరును కాపాడాలి. బాసాలిక కలుపు నివారణ మందును (1లీటరు /200 లీటర్ల నీళ్లలో హెక్టారుకు) పొలంపై చల్లి దుక్కిచేసి విత్తుకుంటే కలుపుబారినుండి పైరును రక్షించుకోవచ్చు.

అవసరాన్ని బట్టి సకాలంలో తగిన సస్యరక్షణా చర్యలను తీసుకొంటే పంటను చీడలు/తెగుళ్లబారినుండి కాపాడి మంచి దిగుబడులను సాధించగలరు.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

రుద్రీయం బహుళ ప్రాచుర్యం పొందినట్లు చెప్పారు. వుత్సవాల సంఘ సభ్యుడు చాట్ల శ్రీరాములు నాటకోత్సవాల ప్రధాన వుద్దేశాన్ని వివరించారు. జాయింట్ కలెక్టర్ ఎం.ఆర్. నాయక్, జిల్లా సెషన్స్ జడ్జి ఎల్. అప్పారావు ప్రముఖ స్థలప్రయోక్త నటుడు డాక్టర్ శివప్రసాద్, ఎస్‌పి పూర్ణచంద్ర రావు మూడు రోజుల సన్మాన కార్యక్రమాల్లో పాల్గొని నిండుదనం చేకూర్చారు. నాటకోత్సవాలలో ప్రదర్శించిన యోగి వేమన నాటకం ఆద్యంతం పేలవంగా సాగినా సంధ్యఛాయ నాటకం బాగా ఆకట్టుకొంది. 31 తేది వెంకటగిరి మాజీ సంస్థానాధీశుడు డాక్టర్ సాయికృష్ణ యాచేంద్ర సంగీత గేయధార హైలైట్‌గా నిలచిందని చెప్పవచ్చు.

### 'మానవతీ లలామ సత్యభామ'

సాహిత్యంలో సత్యభామ గ్రంథావిష్కరణ సభ 29 తేది టౌన్‌హాల్‌లో సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ భారతీయులు శ్రీరాముణ్ణి - కృష్ణుణ్ణి ఆదర్శంగా తీసుకొని ఆరాధిస్తున్నారు. ఉత్తర భారతంలో రాధాకృష్ణులు, దక్షిణ భారతంలో సీతారాములకు ఎనలేని ఆదరణ వుందన్నారు. ఆంధ్ర సాహితీ రంగంలో వివిధ ప్రక్రియలలోను, కళా నాటక రంగాలలోను సత్యభామా కృష్ణులకు విశేష స్థానం లభించిందన్నారు. రుక్మిణి ప్రతివ్రతా శిరోమణిగాను, సత్యభామ మానవతీ లలామగాను పేరు పొందినట్లు చెప్పారాయన. రచయిత పచ్చిపులుసు వెంకటేశ్వర్లు గ్రంథాంతరాల నుంచి సేకరించిన సత్యభామా వైభవ దీప్తులను, ప్రజల నాడిని తెలుసుకొని ఈగ్రంథం రచించినట్లు పేర్కొన్నారు. గూడూరు డి.ఆర్. డబ్ల్యూ కళాశాల ప్రిన్సిపల్ గ్రంథావిష్కరణ గావించారు. వక్త అగస్త్యరెడ్డి గ్రంథాన్ని సమీక్షిస్తూ [illegible] పలు గ్రంథాలను అవలోకించి ఆయా ప్రబంధ పాత్రల గుణ గణాలను అనుశీలించి విపుల విశ్లేషణతో రసభరితంగా గ్రంథం రచించినట్లు చెప్పారు. గ్రంథ ముద్రణా భారాన్ని వహించిన యర్లపల్లి సుందర రావు దంపతులు రచయితను, అతిథులను కాశ్మీరీ శాలువలతో సన్మానించారు. సభారంభంలో ప్రభుత్వ సంగీత, నృత్య కళాశాల విద్యార్థినీ, విద్యార్థులు భక్తి గీతాలాపన గావించారు. చివరన వర్థమాన సమాజ కార్యదర్శి బి.వి. నరసింహం వందన సమర్పణ చేశారు.



రిపబ్లిక్ దినోత్సవ వేడుకల్లో కలెక్టర్ ఎం. సాంబశివ రావు నుంచి ప్రశంసాపత్రం అందుకొంటున్న కలెక్టర్ కార్యాలయం సూపరింటెండెంట్ ఆర్. రామసుబ్బారావు

### సేవా సంస్థలు సమాజాన్ని ఆదుకోవాలి !

సిటిజన్స్ క్లబ్ నూతన అధ్యక్షుని ఎన్నిక కార్యక్రమం ఇటీవల ఘనంగా జరిగింది. ముఖ్య అతిథిగా సర్వేపల్లి శాసన సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి విచ్చేసి మాట్లాడారు. ప్రభుత్వం అనేక సంక్షేమ కార్యక్రమాలు చేస్తున్నా, పలు సమస్యలు మిగిలి పోతున్నాయని, సేవా సంస్థలు తమ వంతు కార్యక్రమాలను చేపట్టి సమాజాన్ని ఆదుకోవాలన్నారు. క్లబ్ నూతన అధ్యక్షునిగా ఎన్నికైన టి.వి.ఎస్. బాబు దీక్షా దక్షతలను ప్రశంసించా రాయన. పారిశ్రామిక వేత్త గోరంట్ల రాధాకృష్ణ మాట్లాడుతూ క్లబ్ మహిళా విభాగం కుటుంబ నియంత్రణ కార్యక్రమం చేపట్టి పేరు గాంచాలన్నారు. పదవ తరగతి పబ్లిక్ పరీక్షలలో జిల్లాలో ప్రథమునిగా నిలిచే విద్యార్థికి బంగారు పతకం బహూకరిస్తానని క్లబ్ సభ్యుడు సుకుమార్ చెప్పారు. సంస్థ ఉపాధ్యక్షులుగా ఎ.వి.ఆర్. మోహన రావు, ఎం.వి.ఆర్. సురేష్ బాబు, జి. శ్రీనివాస రావు, కార్యదర్శిగా ఎం. రవీంద్ర, సహ కార్యదర్శిగా ఎం. రఘురాం, కోశాధికారిగా ఎం. రాఘవరావు పదవీ ప్రమాణాలు చేశారు. మహిళా విభాగంలో టి.లత, జి. అనూరాధ, ఎం.అనూరాధ, వి.ఉషా రాణి పదవులు స్వీకరించారు. కార్యక్రమంలో సంస్థ ప్రారంభ అధ్యక్షులు టి. వెంకటేశ్వర రావు, పదవీ విరమణ చేసిన ఎ.వి. భాస్కర రావు కూడా పాల్గొన్నారు. రచయిత సి.వి. నారాయణ రావు కార్యక్రమానికి వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

### ఉత్తమ పోస్ట్‌మాన్ రామ్మూర్తి

ఎ.కె. నగర్ ప్రాంతంలో మధ్యాహ్నం మూడు గంటల వరకు ఓపికగా వుత్తరాలు బట్వాడా చేస్తుండే పోస్టుమాన్ కె.రామ్మూర్తి ఈ యేడాది నెల్లూరు డివిజన్‌లో వుత్తమ పోస్టుమాన్‌గా ఎంపికయ్యారు. 27 తేది ఎ.కె.నగర్ పోస్టాఫీసులో పోస్టల్ సూపరింటెండెంట్ పి.ఎస్. రామ్ - రామ్మూర్తికి అవార్డు అందించి మాట్లాడారు. పోస్టుమాన్‌కు ఓపిక, ఆలోచన ముఖ్యమని చెప్పారాయన. రామ్మూర్తి ఓపికను ఆదర్శంగా తీసుకొని మిగతా పోస్టుమెన్‌లు అవార్డులు సాధించాలని కోరారు. ఎ.కె. నగర్ బ్రాంచి సూపరింటెండెంట్ శంకర్ రెడ్డి మాట్లాడుతూ ఇంతవరకు ఎ.కె.నగర్ పోస్టాఫీసు నుంచి ఎవరూ అవార్డు పొందలేదని, రామ్మూర్తి ఆ అవార్డు పొంది బ్రాంచికి మంచిపేరు తెచ్చినట్లు చెప్పారు. కార్యక్రమంలో ఎన్.ఎఫ్.పి.ఇ. యూనియన్ కార్యదర్శి షేక్ హుమయూన్, పోస్టల్ ఉద్యోగులు లలితమ్మ, నీరజ, కె. వెంకటేశ్వర్లు, జానకి రామయ్య, బాల పెంచలయ్య, న్యాయవాది ఎస్.వి.ఎల్. వర ప్రసాదరావు పాల్గొన్నారు.

## 50 ఏళ్లక్రితం

3 వపేజీ కొరవ

కలెక్టర్ వుత్తర్వు 29-12-44 నుండి అమలు.

కలెక్టర్ పర్మిట్‌లేనిదే జిల్లానుండి పిల్లిపెసర విత్తనాలను (రైలులోను, సముద్రం, కాల్వద్వారా) ఎగుమతిచేయరాదు. చేస్తే 3సంవత్సరాల శిక్ష, జరిమానా లేక రెండూ, నేరంతాలూకు స్టాకు జప్తి కూడా అవుతుంది.

### కొత్తహాలు

ఏదో అప్పుడప్పుడు యీమధ్య అపనాఫర్ సూరదాస్‌లాంటి కాస్తమంచినరుకు కనబడుంది బట్టి కాబోలు మనఫేమస్ ఫిలిమ్సువాళ్లుగూడ ఆహాల్లోనే థలేపెర్ని జరుపుతునవ్వారు. తర్వాత భక్తగౌరి గూడనట.

### బజారుధరలు

| | |
|---|---|
| కొత్తమొలగొలుకులు | రు. 149లు |
| పాతవి | రు. 154 లు |
| వులవలు తూ1కి | రు. 13-4-0 |
| పిల్లిపెసర్లు " | రు. 20-0-0 |

యివి జిల్లాదాటి పోరాదని కలెక్టరువుత్తరువు.

| | |
|---|---|
| బంగారం సవర 1కి | రు. 46-4-0 |
| వెండి తు 1కి | రు. 1-4-6 |

# శ్రద్ధాంజలి



## శ్రీ చదలవాడ వెంకటేశ్వర్లు – గూడూరు

చదలవాడ వంశ కీర్తి చంద్రికలను ఆచంద్రార్కం అశేష ప్రజానీకం గుర్తించుకొనేలా చేసిన మా ఇంటి దీపం, మా కంటి వెలుగు కనుమరుగై పోయింది. విధి మిమ్ములను మాకు భౌతికంగా దూరం చేసినా పవిత్రమైన మీ స్మృతులు మామదిలో పదిలంగా వున్నాయి. ఇక నుంచి అవే మాకు పూజా కుసుమాలు. మీరు లేక పోయినా మీరు చూపిన ఆదర్శవంతమైన ఆశయాల బాట వుంది. సదా అవే మాకు అనుసరణీయం, ఆచరణీయం. విరిసే ప్రతి పువ్వు మీ నవ్వుకు ప్రతిరూపం. మెరిసే ప్రతి నక్షత్రం మీ నిష్కళంక చరితకు సజీవ సాక్ష్యం. పేద ప్రజలకు, మిత్రులకు, అభిమానులకు, కుటుంబ సభ్యులతో సమంగా ప్రేమామృతాలను పంచిన మీ మనసు ఈ యశస్సులో చిరస్మరణీయం. మా ఇలవేల్పు మృతితో దిక్కుతోచని మమ్మల్ని ఓదార్చి, సానుభూతి వ్యక్తం చేసిన వేలాది ప్రజానీకానికి, వివిధ సంస్థల ప్రతినిధులకు, ప్రముఖులకు మా కృతజ్ఞతాంజలి.

### ఉత్తరక్రియలు

4.2.1995 శనివారం ఉదయం 10 గంటలకు గూడూరులోని శ్రీనివాసతేజ - సుందరమహల్ థియేటర్ల ఆవరణలో స్వర్గలోక ప్రాప్తిపొందిన శ్రీ చదలవాడ వెంకటేశ్వర్లు నాయుడు గారి ఉత్తరక్రియలు జరుగునని తెలియజేస్తున్నాము.

### శోక తప్త హృదయాలతో

చదలవాడ రాజేశ్వరమ్మ (భార్య)
చదలవాడ హరిప్రసాద్ (కుమారుడు)
చదలవాడ రమేష్‌బాబు (కుమారుడు)
చదలవాడ విజయభాస్కర్ (కుమారుడు)
ఆలా రమాదేవి (కుమార్తె)
ఆలా గౌతమ్ శ్రీనివాస్ (అల్లుడు)
ఎస్.వి. ప్రసాద్ (బావమరిది), తిరుపతి
పాబోతు సుబ్రమణ్యం (బావమరిది)
చదలవాడ వెంకట శేషయ్య (సోదరుడు)
చదలవాడ రాఘయ్య (సోదరుడు)
చదలవాడ కృష్ణమూర్తి (సోదరుడు)
చదలవాడ రాజగోపాల్
పాముూరి సుబ్బరామయ్య
ఎం. రంగనాథం
ఎస్. మురళీకృష్ణ (బావమరిది)
తెనాలి మోహన్‌రావు (బావమరిది)



కుర్రది కుర్రాడులో రోజా

# తొందరపడి చేతులు కాల్చుకున్న శారద

"తాయ్ మనసు" తమిళ చిత్రం నిర్మాణంలో వుండగా అందులో మనోరమ నటించే పాత్ర చాలా గొప్పగా ఉందని కొన్ని తమిళ పత్రికలు రాశాయి. ఆ చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తే, మనోరమ పాత్రను శారద ధరిస్తేనే చాలా బాగుంటుందని కొందరు అనుకున్నారు. ఈ విషయం శారదకు తెలిసి రెండు లక్షలు అడ్వాన్సు కూడా చెల్లించి తెలుగులో పునర్నిర్మించాలనుకుంది. ఇంతలో తమిళ చిత్రం విడుదలైంది. వారం రోజులు మాత్రమే ఆడింది. శారదకు ఏం చేయడానికీ తోచలేదు. వారం రోజులు అదే పనిగా ఆలోచించి, చివరికి ఆ సబ్జెక్టును పునర్నిర్మించే హక్కులను వదులుకొంది.

## తమిళంలో "శుభలగ్నం"

"శుభలగ్నం" చిత్రం తమిళంలోనూ విజయం సాధించబోతోంది. దేవీ కమల్ ఫిలిమ్స్ బ్యానర్‌లో కె.సి. శేఖర్ బాబు, కె. వెంకటేశ్వర రావులు నిర్మాతలు. దర్శకుడు : ఎ.ఎం. రత్నం.

## "మాయాబజార్" గురించి దాసరి

"తలకోన షెడ్యూల్‌లో 60 శాతం చిత్రం పూర్తయింది. ఈ చిత్రం తప్పకుండా సంచలనం సృష్టిస్తుంది." అన్నారు దాసరి నారాయణ రావు. ఈ చిత్రంలో ఆయన కాక ఎ.ఎన్.ఆర్. సుమన్, ఆమని, రామకృష్ణ మురళీ మోహన్, చంద్రమోహన్, గుమ్మడి, బాబూమోహన్, గోకిన రామారావు, తోటపల్లి మధు, వేలు, రాళ్లపల్లి, ఎ.వి.ఎస్, ప్రభ, జయంతి, డిస్కో శాంతి, పూజిత, దివ్య, జ్యోతిలక్ష్మి తదితరులు పాల్గొంటున్నారు. మాటలు : తోటపల్లి మధు, సంగీతం : మాధవపెద్ది సురేష్, ఛాయ: రమణరాజు, శిల్పి : భాస్కర రాజు, నిర్వహణ : ఎం.కె. మావుళ్లయ్య, నిర్మాత : ఎ.ఎస్.ఎన్. మూర్తి.

## లక్ష్మి ప్రసన్నలో రజనీకాంత్

రవిరాజా పినిశెట్టి

దర్శకత్వంలో హీరో మోహన్ బాబు ఫిబ్రవరి 10 వ తేదిన ప్రారంభించే చిత్రంలో సౌందర్య నాయిక, రజనీకాంత్ ఒక ప్రత్యేక పాత్రను ధరిస్తారు.

## శ్రీ కోదండ పాణి ఫిలిం సర్క్యూట్ చిత్రం

ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం నిర్మించే చిత్రంలో కమలహాసన్ హీరో. కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించడమే కాక తెర ముందు కూడా ఒక విశిష్టమైన పాత్రలో కనిపిస్తారు. ఆమని నాయిక. ప్రియారామన్, కోట శ్రీనివాస రావు, గొల్లపూడి, ఆలీ, ఎ.వి.ఎస్., మల్లికార్జున రావు, శుభలేఖ సుధాకర్, సాక్షి రంగారావు, రాళ్లపల్లి, వైష్ణవి, రాధాకుమారి నటిస్తున్నారు.

## సినిమా వార్తలు

### "భలే బుల్లోడు"

"ఫిబ్రవరి 18 వరకు నిరవధికంగా కొనసాగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నాడు డైరెక్టర్ శరత్. జగపతి ఆర్ట్స్ "భలే బుల్లోడు" చిత్రంలో జగపతి బాబు, సౌందర్య, కోట శ్రీనివాస రావు, జయసుధ, గిరిబాబు, బాబూమోహన్, సుధాకర్, చలపతి రావు, తనికెళ్ల భరణి, చక్రపాణి, కల్పనారాయ్, జయలలిత, సిల్క్ స్మిత, డిస్కో శాంతి, నిర్మలమ్మ నటిస్తున్నారు. కథ : ఎం.డి సుందర్, మాటలు : తనికెళ్ల భరణి, సంగీతం : కోటి, ఛాయ : సుధాకర్ రెడ్డి, కూర్పు : వెంకటరత్నం. నిర్మాత : వి.బి. రాజేంద్ర ప్రసాద్.

### "దొరబాబు"

శోభన్ బాబు జంటగా ప్రియారామన్ నటిస్తున్న శ్రీ ప్రసన్నాంజనేయ ఫిలిమ్స్ "దొరబాబు" చిత్రంలో పరుచూరి వెంకటేశ్వర రావు, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, ఎ.వి.ఎస్., నిర్మలమ్మ, చంద్రమోహన్, శ్రీహరి, శ్రీలత, జరెన్ లిగ్ నటిస్తున్నారు. బోయిన సుబ్బారావు దర్శకత్వం వహించే ఈ చిత్రానికి బి.వి.కె. మోహన్ నిర్మాత.

# తాగితే తప్పేముంది?

"నేను మందు తీసుకుంటూన్న విషయం అందరికీ తెలిసిందే. ఇందులో దాపరికం ఏమీ లేదు. కాకపోతే మోతాదు మించకుండా తీసుకుంటే తప్పేమీ లేదు. ఈ విషయం అందరికీ తెలుసు. కాని, మితిమీరి మద్యం పుచ్చుకొని తాగి తందనా లాడాల్సిన గ్రహచారం నాకేమీ లేదు. ఇతరులకు భయపడి కొందరు తాగకుండా మానుకోవడమూ నాకు తెలుసు. కానీ నాకేం భయం లేదు. ఐ లవ్ డ్రింకింగ్. బట్ టు ఎ లిమిట్." అంటూంది మనీషా కొయిరాలా.

### ఘటోత్కచుడు

"డాక్టర్ రాజశేఖర్ కర్ణుడు, జగపతి బాబు అర్జునుడు, శ్రీకాంత్ శ్రీకృష్ణుడు, విజయ రంగరాజా భీముడు, గిరిబాబు ధర్మరాజు, ప్రసాద్ బాబు దుర్యోధనుడు, జగ్గు అలంబసుడుగా గెస్ట్ ఆర్టిస్టులు. నాగార్జున మరో గెస్ట్ ఆర్టిస్టు. సత్యనారాయణ టైటిల్ పాత్రధారి. రోజా, ఆలీ మరపురాని జంట. ఫిబ్రవరి 15 తో ఈ చిత్రం షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు డైరెక్టర్ ఎస్.వి. కృష్ణారెడ్డి.

> కోయిరాలా ఎదురుప్రశ్న!

### "ఆయనకు ఇద్దరు"

జగపతి బాబు, రమ్యకృష్ణ, ఊహ ప్రధాన పాత్రధారులు. ఫిబ్రవరి 15 నుంచి మార్చి 15 వరకు రెగ్యులర్ షూటింగ్. ఏప్రిల్ 1 నుంచి 15 వరకు మారిషస్, మలేషియాలో మూడు పాటలు చిత్రీకరణ జరుగుతుంది. మే మొదటి వారంలో విడుదల అవుతుందని డైరెక్టర్ ఇ.వి.వి. సత్యనారాయణ తెలిపారు. మాటలు : ఆకెళ్ళ, సంగీతం : కోటి, ఛాయ: విజయ కుమార్.

### "వియ్యాల వారి సవాళ్లు"

నేషనల్ ఆర్ట్ మూవీస్ సంస్థ తమ నాల్గవ చిత్రం "వియ్యాల వారి సవాళ్లు" కు సన్నాహాలు చేస్తోంది. సత్యనారాయణ - శారద, మౌళి - లక్ష్మి ప్రధాన పాత్రధారులు. కథ, దర్శకత్వం: మౌళి.

### రేలంగి దర్శకత్వంలో "కేటు - డూప్లికేటు"

"తమాషా అయిన రెండు పాత్రలను రాజేంద్ర ప్రసాద్ చేస్తున్నారు. ఫిబ్రవరి 18 కి షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు రేలంగి నరసింహా రావు. ఈయన చాలాకాలం తర్వాత దర్శకత్వం వహించే చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, సురభి, సత్యనారాయణ, బ్రహ్మానందం, వేలు, ఎ.వి.ఎస్., శుభలేఖ సుధాకర్, శివాజీరాజా, కల్లు చిదంబరం, రాజేశ్వరి, సుశీల మున్నగువారు నటిస్తున్నారు. కథ : బి.ఎస్. రామారావు, మాటలు : శంకరమంచి పార్థసారథి, సంగీతం : కోటి.

### సాహసవీరుడు - సాగర కన్య

ఇదొక సోషియో ఫాంటసీ చిత్రం. కె. రాఘవేంద్ర రావు దర్శకత్వంలో బూరుగుపల్లి శివ రామకృష్ణ నిర్మిస్తున్న చిత్రంలో సాహస వీరుడుగా వెంకటేష్, సాగర కన్యగా శిల్పాశెట్టి నటిస్తున్నారు.

# ఉత్తరక్రియలు



జననం
19.5.1924

మరణం
29.1.1995

# శ్రీ దేగా సుందరరామరెడ్డి గారు

29.1.95 తేది ఆదివారం స్వర్గస్థులైనారు

వారి పవిత్రాత్మకు చిరశాంతి కలుగచేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## వారి ఉత్తరక్రియలు

7.2.95 – మంగళవారం – శిలాప్రతిష్ఠ

8.2.95 – బుధవారం – శిలోద్వాసన

నెల్లూరు, రామలింగాపురంలోని మా స్వగృహమున జరుగును.
బంధుమిత్రులు తెలియగోరుతాము.

భార్య - దేగా జయలక్ష్మమ్మ

సోదరులు: దేగా రామ్‌గోపాలరెడ్డి
దేగా నారశింహారెడ్డి

కుమారులు: దేగా దయాకరరెడ్డి
దేగా శ్రీనివాసులు రెడ్డి

అల్లుడు: గుండ్రా జనార్థన రెడ్డి

కుమార్తె: గుండ్రా వసుంధర



నెల్లూరు డివిజన్‌లో ఉత్తమ పోస్ట్‌మెన్‌గా ఎంపికైన ఎ.కె. నగర్ రామ్మూర్తిని అభినందిస్తున్న పోస్టల్ సూపరింటెండెంట్ వి.సి. రాయ్. పి.ఆర్.ఓ. జానకి రామయ్య, అసిస్టెంట్ పోస్ట్‌మాస్టర్ బాలపెంచలయ్య చిత్రంలో వున్నారు.

## జనవాణి

3 పేజీ కొరవ

### హర్షణీయం

తెలుగుదేశం పార్టీ మహిళల్లో చైతన్యం తెచ్చేందుకు అత్యధికంగా పాటుబడిందనే చెప్పాలి. అస్త్రిహక్కు, మహిళా విశ్వవిద్యాలయం, స్థానిక సంస్థలలో రిజర్వేషన్లకు తోడుగా మహిళలు వుద్యమించినందుకు అభినందించి సంపూర్ణ సారా నిషేధాన్ని ప్రకటించింది. పై విధానాలేగాక మరి కొన్ని తీరని సమస్యలపై కూడా ప్రభుత్వం దృష్టి కేంద్రీకరించాలి. ముఖ్యంగా పట్టణాల్లో కాలేజి అమ్మాయిలతో పాటు దారినపోయే మహిళలకు టీజింగ్ పెద్ద సమస్యగా మారివుంది. దీన్ని అంత మొందించేందుకు మహిళా పోలీసులను ప్రత్యేకంగా నియమించాలి. ఆడ పడచులపై నానాటికీ అధికమవుతున్న అత్యాచారాలకు అడ్డుకట్ట వేయాలి. కాలేజికి వెళ్ళే మహిళల కోసం నిర్ణీత సమయాల్లో బస్సులను ప్రత్యేకించి నడపాలి. ఈ విషయంలో అన్నగారికి లక్ష్మీపార్వతి విన్నవించి మహిళలకు న్యాయం చేయాలని మనవి.

నెల్లూరు -వాస్తు వరలక్ష్మి.

### ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేట్ బిఫార్మసి కాలేజీలు!

గత 10 సంవత్సరాలుగా ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేటు రంగంలో ఇంజనీరింగ్, మెడిసిన్ బి.ఫార్మా, డి.ఫార్మా, ఫిజికల్ ట్రైనింగ్ కళాశాలలు స్థాపించ బడలేదు. ప్రభుత్వం అనుమతి ఇవ్వనందున రాష్ట్రంలోని విద్యార్థులు ఎంతో ఖర్చు పెట్టుకుని కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలలో చదువుకొనేందుకు వెళుతున్నారు. కర్ణాటక, తమిళనాడు ప్రభుత్వాలు అటువంటి సంస్థలు ప్రారంభించేందుకు అనుమతి ఇవ్వడంవల్ల 200 సంస్థలు ఆ రాష్ట్రాలలో నడుస్తున్నాయి. మనరాష్ట్ర ప్రభుత్వం కూడా ఈ విషయమై పరిశీలించి తగు నిర్ణయం తీసుకోవడం ద్వారా కోట్లాది రూపాయలు ప్రభుత్వ ఖజానాలో జమ పడుతాయి.

నెల్లూరు -పొమ్మిన సుబ్రహ్మణ్యం.

### ప్రైవేటీకరణ వల్ల మేలు జరుగదు!

ప్రభుత్వం ఇటీవల ప్రైవేటీకరణ జపం చేస్తున్నది. రైల్వేలలో ఆయితే మరుగుదొడ్లు కడిగేపని కూడా ప్రైవేట్ వ్యక్తులకు అప్పగించారు. వీరు ఇష్టమొచ్చినంత దోపిడీ చేస్తున్నారు. పెద్ద పెద్ద పారిశ్రామిక వేత్తలు ప్రైవేటీకరణను సమర్థిస్తున్నారు. ప్రైవేట్ సంస్థలలో చేరిన వారికి ప్రభుత్వ శాఖల్లో ఇచ్చినట్లు జీతాలు ఇస్తారా? ఇప్పటికే వున్న పలు ప్రైవేట్ సంస్థలు కార్మికులను బానిసలుగా పనిచేయిస్తూ దోపిడి చేస్తున్నాయి. ఇటీవల విచారిస్తే స్పిమ్స్‌లో కాంట్రాక్టర్ లేబరుకు 600 రూపాయలు ఇస్తున్నట్లు తెలిసింది. దీనివల్ల ఈ రోజుల్లో ఒక కుటుంబం ఏవిధంగా బ్రతక గలదో నాయకులు ఆలోచించాలి. ప్రైవేటీకరణ వల్ల ధనస్వాములు ఇంకా పెద్దవాళ్ళు కావడం తప్ప పేదలకు మేలు జరగడం కల్ల అని చెప్పవచ్చు.

నెల్లూరు -టి.వి.నారాయణ.

### విజయనిర్మలను సన్మానించాలి!

ఒక సినిమాకు దర్శకత్వం వహించడం మాటలు కాదు. చిత్ర ప్రారంభం నుండి విడుదలయ్యే వరకు కత్తిమీద సాము. అటువంటి రంగంలో ఒక మహిళ ప్రవేశించి విజయం సాధించడం గొప్ప విషయం. అటువంటి వారిలో నటీమణిగా, దర్శకురాలిగా విజయం సాధించిన విజయనిర్మలను గురించి చెప్పుకోవాలి. తెలుగులో మహిళా దర్శకులు భానుమతి రామకృష్ణ, పి. శాంతలక్ష్మి, సావిత్రి వంటి వారు ఎందరో వుండినారు. కాని అన్ని రకాల చిత్రాలు తీసిన దర్శకురాలు విజయనిర్మల మాత్రమే. మీనా, దేవదాసు వంటి ఛాలెంజింగ్ చిత్రాలకు దర్శకత్వం వహించి విజయం సాధించారామె. 40 చిత్రాలకు దర్శకత్వం వహించిన మహిళా దర్శకురాలిగా గిన్నిస్ బుక్‌లోకి ఎక్కే అర్హత సంపాదించారు. ఎందరో కొత్తతారలకు తన చిత్రాలలో అవకాశం ఇచ్చిన విజయనిర్మల కృష్ణతో పెళ్లయిన తర్వాత కూడా 50 చిత్రాల్లో నటించి మరో రికార్డు నెలకొల్పారు. అనేక ప్రశంసలతో పాటు ఎన్నో రివార్డులు అందుకున్న ఈమెను ప్రభుత్వం సత్కరించాలి. చలనచిత్ర శతాబ్ది వుత్సవాలు జరుగుతున్న ఈ తరుణంలో కళామతల్లి ముద్దుబిడ్డగా పిలవబడే ముఖ్యమంత్రి ఎన్టీఆర్ ఈ పనిచేస్తే బాగుంటుంది.

హైదరాబాద్ -ఎం.నరసింహారావు.

### కాలనీపేరు మార్చడం ఎమ్మెల్యేకు తగదు!

వెంకటేశ్వరపురం పెన్నానది స్థలంలో బర్మాషెల్ గుంట, రైల్వే వీధులను ఆటోరిక్షా డ్రైవర్లకు ఇండ్ల స్థలాలుగా ఇచ్చారు. 1991లో జరిగిన కౌన్సిల్ మీటింగులో ఆ కాలనీకి వేదురుమల్లి జనార్ధనరెడ్డి కాలనీగా పేరు పెట్టేట్లు తీర్మానించారు. కాలనీ పేరు ఆర్చ్‌గాకట్టేందుకు 18 వేల రూపాయలు ఖర్చుపెట్టారు. లారీకొట్టివేయడం వల్ల అది కుప్పకూలి పోయింది. ఈ కాలనీ పేరు తీర్మానం చేసినప్పుడు రమేష్‌రెడ్డి మున్సిపల్ చైర్మన్‌గా వుండినారు. ప్రభుత్వం మారింది. రమేష్‌రెడ్డి ఎమ్మెల్యే అయ్యారు. ప్రస్తుతం ఈ కాలనీ పేరును లక్ష్మీపార్వతి నగర్‌గా చేస్తున్నట్లు ఇటీవల ప్రకటించారు. కాలనీకి వున్న పేరును మార్చడం ఎమ్మెల్యేకు తగదు. జనార్ధనరెడ్డి కాలనీకి పోయే దారిలో కాలువకు బ్రిడ్జి, విద్యుత్ సౌకర్యం, మంచినీటి బోర్లు 1991లోనే మంజూరయిన విషయం ఎమ్మెల్యే గమనించాలి.

నెల్లూరు -షేక్.గౌస్‌మొహిద్దీన్.

---

# శ్రద్ధాంజలి



మంచికి మారు పేరుగా ప్రేమానుబంధాలతో అందరినీ అలరించి, మరచిపోలేని స్మృతులు మిగిల్చిన మా సోదరుడు

## శ్రీ నల్లవడ్ల శంకరరెడ్డి గారు

(ప్రొ. ఎన్. శంకరరెడ్డి లెమన్ కంపెని, డైరెక్టర్, సిరిమల్లె చిప్స్ ప్రైవేట్ లిమిటెడ్)

28.1.1995 వ తేది శనివారం అకాలమరణం చెందారని తెలియజేయుటకు చింతిస్తున్నాము.

వారి ఉత్తరక్రియలు

10.2.95 శుక్రవారం రాత్రి — శిలాప్రతిష్ఠ

11.2.95 శనివారం ఉదయం — ఎత్తురేవు, పొత్తర్లు

నెల్లూరు ఫత్తేఖాన్‌పేట D.No. 23/206, మా స్వగృహమునందు జరుగును.

బంధుమిత్రులకు తెలియచేయడమైనది.

భార్య
నల్లవడ్ల జయలక్ష్మమ్మ
నల్లవడ్ల రజని - కుమార్తె
నల్లవడ్ల సుజన - కుమార్తె
దందవోలు రామకృష్ణారెడ్డి - మామ
దందవోలు పిచ్చమ్మ - అత్త

సోదరులు
నల్లవడ్ల వెంకట నరసారెడ్డి
నల్లవడ్ల వెంకట సుబ్బారెడ్డి
నల్లవడ్ల వెంకట రమణారెడ్డి
నల్లవడ్ల వెంకట రత్నారెడ్డి
నల్లవడ్ల వెంకట రమణా రెడ్డి

బావమరుదులు
దందవోలు పెంచలరెడ్డి - లీలావతి
దందవోలు పెంచల నరసారెడ్డి - రేణుక
దందవోలు పట్టాభిరామిరెడ్డి - సుజాత
దందవోలు జయరామిరెడ్డి - రామసుబ్బమ్మ
దందవోలు రామకృష్ణారెడ్డి

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Navagara Paper Products (India) Ltd.,